# శుద్ధపత్రిక.



| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧ | ౭ | హిమః | హూమః |
| ౨ | ౫ | నాక్రోశోశా | నాశాక్రోశా |
| ౬ | ౩ | ఇకార | అకార |
| ౮ | ౧౪ | గరకంఠా | గ అకంఠా |
| | ౨౧ | ఏడు | ఏదు |
| ౧౫ | ౩ | ఖాతం | ఘాతం |
| ౧౯ | ౨౦ | సస్త్రిము-లు | నస్త్రిములు |
| ౨౧ | ౧౪ | పూర్వ | పూర్వా |
| | | కారిణా | కారిణః |
| | ౨౯ | ఏదులెత్తిగిన | ఏదువెత్తిగిన |
| ౨౫ | ౭ | ధృవము | ధ్రువము |
| | ౧౪ | పూర్వ | పూర్వా |
| ౨౭ | ౧౭ | చాస్త్రి | చాస్థి |
| ౨౮ | ౧౫ | ఆస్త్రి | ఆస్థి |
| ౩౯ | ౧౯ | ద్రిత్వ | ద్రివత్వ |
| | ౨౦ | ద్దిత్వ | ద్దివత్వ |
| ౪౦ | ౧౬ | ఏత్వన్య | యేత్వన్య |
| ౪౩ | ౬ | శకట | శకటః |
| ౪౬ | ౬ | త్త్రద్భవాత్సం | స్త్రద్భవాస్సం |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | ౧౪ | శేషిం | షేథిం |
| ౪౭ | ౨౧ | వీరుధా | వీరుధాం |
| ౪౯ | ౯ | ర్యంతె | ద్యంతె |
| ౫౦ | ౧౩ | నామ్నై | నామై |
| ౫౨ | ౭ | నసం | న్నసం |
| ౫౫ | ౭ | పించి | పెంచి |
| ౫౬ | ౧౪ | ద్వా | ద్వా |
| | ౧౬ | నరిగిం | నరిగెం |
| ౫౮ | ౧౦ | భాన | భాస |
| | ౧౩ | వ్యదా | వ్యధా |
| ౬౨ | ౧౭ | ణత్యే | ఇత్యే |
| ౬౫ | ౨ | గకార్య | గకార |
| ౬౬ | ౩ | ఎందుపొరుగు | ఎందుచొరుగు |
| ౭౨ | ౫ | విరి | చిరి |
| | ౬ | ప్రాస్తః | ప్రాప్తిః |
| ౭౩ | ౭ | భగతా | సుభగతా |
| | ౨౨ | చయాలు | చయాలం |
| ౭౪ | ౪ (1) | పన్నైరము | పన్నైరము |
| ౭౪ | ౧౦ | బూతాశౌచం | జాతాశౌచంచ |
| | ౧౧ | ప్రాతం | ప్రాంతం |
| | ౧౨ | త్వర్చ | త్వక్చ |
| ౭౯ | ౬ | ప్రవ్వ | పువ్వ |
| ౮౦ | ౧౧ | లిడుపు | విడుపు |
| ౮౧ | ౮ | జూజూ | బుజూ |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౮౩ | ౩ | పంక | పకః |
| | | సుషిమ | సుషమ |
| | ౧౦ | మైకొను | మెయికొను |
| ౮౪ | ౧ | గురు | గరు |
| ౮౬ | ౧౦ | సుమః | సుమ |
| ౮౯ | ౧ | కించి | డించి |
| | ౩ | తూలదిదాదాహను | తూలాదిదాహః |
| | ౨౪ | క్రియస్వా | క్రియాస్వా |
| ౯౦ | ౧౭ | బొడ | బొన |
| ౯౩ | ౧ | రిజ్వం | రుజ్వం |
| | ౪ | రదయ | రాదయ |
| | | రదయో | రాదయో |
| | | హాతాః | హితాః |
| ౯౪ | ౨౨ | శ్వ్యా | స్వ్యా |
| ౯౫ | ౧౦ | త్వర | త్వర |
| | | కట | కటః |
| ౯౬ | ౪ | ఘూర్ణిత | ఘూర్ణిత |
| ౯౮ | ౨ | నింగ | నింగి |
| | ౧౦ | దురవస్త | దురవస్థ |
| | ౧౧ | భూర | భూర |
| | ౧౮ | యూరమి | యూరము |
| ౯౯ | ౧౦ | టయు | టయు |
| | ౧౭ | మూల | దూల |
| ౧౦౦ | ౨ | నీజ | నీది |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | ౬ | కోను | కోని |
| | ౧౭ | గూర్తురు | కూర్తురు |
| ౧౦౧ | ౪ | ఓర, ఓర | ఓర,ఓర్వ |
| ౧౦౪ | ౧౩ | జీవి | జీవ |
| ౧౦౬ | ౩ | మత్యా | మత్సాక్షి |
| ౧౦౭ | ౯ | బరము | బలము |
| ౧౦౯ | ౪ | ఛండాలు | చండాలు |
| ౧౧౦ | ౮ | వాగ | దాగ |
| | ౯ | జారులు | జాలరులు |
| ౧౧౧ | ౫ | వేడు | లేడు |
| | ౧౯ | జీవి | జీవ |
| ౧౧౪ | ౨ | బోదిలి | బోదివి |
| ౧౧౫ | ౨౧ | బగశుల | బగళుల |
| ౧౧౬ | ౫ | స్రుక్సు | స్రుక్స్రు |
| | ౧౫ | ప్రత్ర | పుత్రి |
| | ౨౪ | దన్ముఖ | దిఙ్ముఖ |
| ౧౧౮ | ౧ | సంప్రవృత్తై | సువృత్తై |
| ౧౧౭ | ౫ | బారన | ఖారము |
| ౧౨౦ | ౧౦ | యాకా | యకా |
| ౧౨౨ | ౪ | తాయాంతి | తాంయాతి |

శ్రీరస్తు.

శ్రీమత్కుమారరమణాయనమః.

# శకటరేఫనిర్ణయము.

శ్లో॥ వక్ష్యామిశకటాన్ రేఫాన్ శృణుష్వాంధ్రే ప్రవర్తితాన్
గౌరీపతేయతస్త్వమ్మే ప్రవక్తుంమామచూచుదః॥ ౧॥

టీ॥ ఓయిసాంబమూర్తీ! ఆంధ్రశాస్త్రవిషయమై ప్రవర్తింపఁ జేయఁబడిన శకటరేఫలను జెప్పుచున్నాను వినుము. ఎందువలన శకటరేఫములను జెప్పుకొఱకు స్వప్నమందు నన్ను గూర్చి చోదన జేసితివో ఆకారణమువలనఁ జెప్పుచున్నాను.

శ్లో॥ యస్మాన్మే ప్రేరకశ్చాసి అధిదైవంయతోహిమః।
యదాంధ్రభాషాస్రష్టాత్వంతతోవాచయితాభవాన్॥

టీ॥ ఎందువలన నాకుఁ బ్రేరకుఁడవైతివో, ఎందువలన నహంకారతత్వమున కధిదేవతవైతివో, ఎందువలనఁ దెనుఁగు శాస్త్రమును నీవుపుట్టించితివో ఆకారణమువలన నాచేతఁ బలికించువాఁడవునునీవే.

శ్లో॥ మాతృకాక్షరగత్యాచస్వరగత్యాతతోహలాం।
క్రమశశ్శకటాన్ రేఫాన్ మయాత్వంవాచయశ్శృణు॥ 3॥

టీ॥ పంచాశదక్షరక్రమముగా సంభవించినని, వర్ణములనుఁ జె

ప్పుచున్నాను హల్లులను జెప్పు నెడలఁ బ్రతిహల్లునకు, ఆకారము మొదలుకొని యథాసంభవముగా నచ్చులను క్రమముగాఁ జెప్పుచున్నాను. క్రమముగాఁ బూర్వవర్ణనిర్దేశము చేసి చెప్పుచున్నాను. పలికించువాఁడవు నీ వేయగుటవలన నాకుఁ దోపఁజేసి పలికించుకొని వినుము

శ్లో॥ నాతివ్యాప్తమపి గ్రీవానాక్రోశోశాక్రమూఅపి।
వికలంఛిద్రితంచార్ధంపష్టిరర్ధనఖంతథా।
కర్కశంఛద్మపాణిశ్చాపక్వత్వార్వ్యాశ్శకటాఇమే॥

టీ॥ ౧. నాతివ్యాప్తం=అతిముతి; అతి యనగా కొంచెము, ముతి యనగా పోరిగు; ఈ రెండుపదములకును ద్వంద్వసమాసము. మిక్కిలి విస్తారము కాదనుట. ఇందుకు భారతోదాహరణము:—

" క. అతిముతినంగములెల్లను।
నులుముగ నిట్లడరునర్జునునియమ్ములకుఁ।
న్వెఅచఅచి సూతపుత్రుఁడు।
పఅచెఁబుడమియద్రువమత్స్యపతిసుతుఁడార్వన॥"

" నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాంరయోస్తు నిత్యంస్యాత్ " అని యున్నది గనుక ప్రాస, ప్రాసయతులలో శకటముండిన సన్నియును శకటములే రేఫముండిన నన్నియు రేఫములే యుండవలెనని శాస్త్రనియమము గనుక నీనాలుగు ప్రాసాక్షరములు శకటములని విశ్వసింపవలెను అట్లయినయెడల నాంధ్రమునందు ఋకారము లేదుగనుక రేఫోకారయుక్తముగ వ్రాసి రేఫరూపద్విత్వము పరమందుండగా బూర్వవర్ణమునకు గురుత్వవికల్పముగనుక నిక్కడ లఘువుగా నుచ్చరింపవలెను. ఇందుకుదాహరణము:—

" క. వేడుక మైదలఁపడిపో।
రాడిరిభగదత్తద్రుపదుఁల స్త్రిబలము శౌ।

ర్యాడంబరములు నెలుగులు।
జూడవినవిచిత్రముగను-శుంభద్భంగిన్॥" అని.

౨. గ్రీవా = అఱకట, అఱ్ఱు, అఱుత, అఱకయొద్దు; ఉదాహరణము—

" క. అఱకటనిడిపాఱిఝషుఁడై।
పఱచిజలధిలోనజదల-వ్వాఱు నెడంజే।
వఱిడప్పినిలువఁజాలక।
యొఱగినగాలవునిడించె-నొకగిరిమీఁదన్॥"

3. నాశః=బిట్టఱ. అసఁగాబీరమునశింపఁగా, జొన్న చేనిలో అఱప, అఱుదైవులు, అఱిగెయనునాయుధము, అనియున్నదిగనుకన న్నమఱిగె, న్నఱకజేసె ననియుఁగలదు. అఱిపె, అఱుగు, ఉదాహరణము—

" క. సోఱకవిరాటుబలముపై।
గొఱియలపిండునకుఁగవియు-కోల్పులికిఱ్ఱియబి।
టుఱఁగదిసినదీనులానుఁడు।
నుఱుమాడెవియచ్చరులుప-నుతిస్తోత్రకులగన్॥" అని.

౪. ఆక్రోశః=అఱచుట. ఉదాహరణము—

" క. అఱచినఁబఱచినవేళ్ళుం।
గఱచిననతఁడించుకయును-గరుణింపకయం।
దఱనుగ్గుజేసెగుంపుల।
నుఱికియుఘుశిఖద్గద్ధారు-నోల్లాసమునన్॥"

౫. ఆక్రమః=అఱుముట. ఉదాహరణము—

" కొ. ఎఱుఁగుదునేదుర్యోధను।
కొఱగామియుఁతనితోడఁ-గూడినన్నృపులం।

దఱుబగ మనమున నిగుకొని।
యఱుముటయును సంధిపొసఁగ-దనియుమహాత్మా॥"

౬. వికలం=తిఱువఱులు. అఱయనఁగా సగము. వఱయనఁగా వఱుగు. ద్వంద్వ సమాసము. ఉదాహరణము—

"క. నుఱుమైన కాల్బలంబున।
నఱవఱలైయున్న యట్టి-యరిదండంబులు పెం।
నఱచగుసూతాంగకములు।
నోఱగినరథ్యములగములు-నుల్లమలంపన్॥"

౭. ఛిద్రితః=అఱువుళ్ళు. నూతిచుట్టుఅఱువడి. ఉదాహరణము-

"క. ఊఱకనరుఁడట్లుమైమఱు।
వఱవుళ్లుగఁజేసిలీల-నరంగము లెల్లన్।
బఱియలుగఁజేయనాతం।
డఱమెడలక మఱియు నేసె-నర్థకరయమునన్॥"

౮. అర్ధం=అఱ. అఱగోఱలు, ఉదాహరణము--

"క. అఱగోఱలుగురుచలఘువులు।
నోఱపుశరీరంబుగలిగి-యొరులనుఁజూడం।
గోఱగాకుండియుమన్మథు।
నోఱపులఁబడిమెదునితండు-యువతీప్రియుఁడై॥"

౯. షష్టిః=అఱువది ; ఉదా:—

"క అఱువదికోటులుకపివరు।
లుఱకజగత్రయమునొక్క-యుశ్వేత్తుగొనన్।
దఱిగొన్న యట్లునడువఁగ।
నెఱసికుముదుఁడరుగుదెంచి-న్నపవనుఁగనియెన్॥"

అర్వాదియని సంయుక్తమైనయెడల శకటముగాదు రేఫమగును;

౧౦. అర్ధనఖం=అఱగోళ్లు, అర్ధచందమామ. అఱ మూత. ఉదా:—

"క. నిన్న నఱసచ్చిపోయితి।
యున్న య్యఱయు నేడ్చుదీర్చి-యుడిపెదనీగ।
రోన్నతియింకెటవోయెగు।
నన్నుఱుఁగ వెయనాచువచ్చి-స్గాపైఁగవిసెన్॥"

౧౧. కర్కశం=అఱవఱి అఱవదనము ; ఉదా:—

"ఆ. ఉలుముగొన్న వాఁడు-దొలుమేననాఘాత।
బంధనములనోరుల-ప్రన్న దనము।
చెఱచినాఁడుపంగు-లఱవలైకార్శ్యయు।
విఱచిసాధుజనుల-బఱచినాఁడు॥"

౧౨. ఛద్మ=అఱ, ఆఱమఱ ; ఉదా:—

"ఆ. దుర్ణయమునశకుని-కర్ణదుశ్శాసనుల్।
గఱపబాండవులకు-నఱయొసేయఁ।
గడఁగెఁబాండవులను-గడుధార్త్రికులుగానఁ।
బొరయవమ్మెవారి-దురితవిధులు॥" అని.

౧౩. పాణి=అఱచేయి, అఱకాలు ; ఉదా:—

"క. పిఱుదంగురుధరణీపతి।
నఱచేతం బ్రాణములును-నభియాతిబలం।
బుఱినతెగువఱుందఱబడ।
గోఱలుటచిత్తమునఁబెట్టు-కొనివిహరించెన్॥"

అఱిముఱి, అఱకట, అఱ్ఱు, అఱుత, అఱకయెద్దు, బిట్టఱ, అన్నమఱిగె, అఱకచేసె, అఱమఱట, అఱుమఱట, అఱివఱలు, అఱువుళ్ళు, నూతిఅ

ఱువడి, అఱనోఱలు, అఱువది, అఱచందమామ, ఆఱపాలు, అఱవ, ఆఱవతనము, అఱసేయక చెప్పెద, అఱమఱ. అఱవిరి, అఱచేయి, అఱకాలు ఇత్యాదులు ఇకారపూర్వశకటములు. అఱవఱలు శబ్దము చేత వఱపు టేడు అఱమఱశబ్దము చేత మఱగాలు. మఱగాడు, బట్టమఱక మొదలయినవియును

శ్లో॥ తథాసంకులమిత్యాద్యం రేఫశ్శకటసంజ్ఞితః॥

టీ॥ సంకులం=ఇఱుకు. ఇఱుకట, క్రిక్కిఱిసి, ఇఱిసె, ఇఱియుదురు, బంధియిఱుసు, ఉదాహరణము—

"క. ముఱిముఱి-చీఁకటియప్పుడు।
నఱిముఱిభటులుడుగక డరి-యని సేయంగా।
నెఱిసితమ మెల్లయెడఁ గ్రి।
క్కిఱిసినమఱిపాసి నిలిచి-రింతనునంతన్॥"

ఇత్యాదులి కారపూర్వ శకట రేఫములు—

శ్లో॥ కూపాదిపాతస్సహనంగర్జాచాధికఉన్ముఖం॥

టీ॥ ౧. కూపాదిత్య=నూతిలోనుఱుకుట, చెట్టెక్కియుఱుకుట, కొఱతనుఱుకుట; ఉదా:—

"గీ. ఏచిమున్నీరు చేయూత-నీదనగ్గి।
నుఱుక వాసుకికోరలు-వెఱుకఁగడఁగి।
నట్లకాదె రాధేయనీ-వర్జునునను।
బోరనెక్కటిమార్కొనఁ-బూనుటరయ॥"

౨. సహనం=ఉఱువు. ఉఱునెడ, ఉఱదు, ఉఱియతెగువ, ఉఱక. ఉదాహరణము—

"ఆ. అంతతోడ నెల్ల-యాపదలు నుడిగి
వంశ మధిక గౌర-వంబునందుఁ
గూడి మనుటగలుగు-గురుపాండవులకుని
త్తెఱఁగు మీకుఁ జూడ-నుఱవె కాదె॥"

"చ. ఎఱిఁగితి నిన్ను నేను విబు-ధేంద్రుఁడ వీవు జగత్త్రయంబుఁ గ
చ్చి భవదీయ రక్షణము-నంద వెలుంగుచు నుండు నట్టిని
నా ఋవుగ నేను వేడికొన-నుక్తుఁడ గాక మొఱంగి నన్నున
—అవడి నీవు వేడుటిది-కర్జమె నిర్జితదైత్య! చెప్పుమా॥"

3. గర్జా=ఊఱుము. ఉదాహరణము—

"క. ఊఱుము చుమెఱయుచుఁ బిడుగులు
వఱలఁగ నలుగడలఁ బడన-వారిని వృష్టుల్
గుఱుకొని కుఱియఁగఁ బంచెను
మెఱయును నయ్యసలు మీఁద-మఘవుం డలుకన్॥"

౪. అధికం=ఊఱువు. ఉదాహరణము—

"క. ఊఱువగు నారికెపంటలు
గొఱియలపాడియును దఱుచ-గుంబురుషులకుం
దెఱవల చుట్టములయ్యెద
రెఱచియ భుజియింతు రర్థి-నెల్ల జనంబుల్॥"

ఊఱుకుట, ఊఱువు, ఊఱుము, ఇత్యాదు లుకార పూర్వక శకటరేఫములు.

శ్లో॥ ప్రాహాస్యైవకారముఖ్యం జ్ఞానంమాంసం వ్యాధోగరున్నతిః

౧. జ్ఞానం=ఎఱుక. ఉదాహరణము—

"క. ఎఱుకగలవారిచరితలు।
గఱచుచుసజ్జనులగోష్ఠిఁగదలకధర్మం।
బెఱుఁగుచునెఱిఁగినదానిని।
మఱువకనుష్ఠించునదిస-మస్థిరబుద్ధిన్॥"

౨. మాంసమ్=ఎఱచి. ఎఱుపు, ఎఱనింగి, ఎఱసంజ, ఎఱకలువ, ఉదాహరణము—

"క. పఱవనోపకయున్నమై-మఱచికెంటిఁ।
బెనఁగియున్న నుబ్రసవింప-మొనసియున్నఁ।
దవులువడియున్న మృగములఁ-దివిరియేయ।
రెఱచియాహారముగను-నెఱుకులైన॥"

3. వ్యాధః=ఎఱుకువాఁడు. ఉదాహరణము—

"క. ఎఱుకనితెఱుఁగకనీకు।
నఱకువనెదిరించినాఁడ-మఱవుముదీనిం।
గరకంఠాక్షమియుంపుము।
నెఱినెవ్వరికెఱుఁగనౌను-నీచరితంబుల్॥"

గరుత్=ఎఱక; ఉదా:—

"క. ఎఱకలువిచ్చుచుదుంపము।
దఱచుచు వేగడరిసాగసి-త్రెల్లివివశుఁడై
యఱచిననోడకుమనిహరి।
నెఱిచక్రాఁగఁద్రోచియొత్తెఁ-నెగయుంగ్రపతోన్॥"

౪ నతిః=ఎఱగుట; ఏడువెఱిగినట్లు; పాదంబులకెఱగ; శాఖపైనెఱగ; ఉదాహరణము—

,, క. ఎఱగినవప్పెను వ్రేగున।
విఱుగుటయును శాఖఁజూచి-విహగేంద్రుఁడు గోం।
దఱమునులనందుఁగనుగొని।
వెఱపున నాత్మీయచిత్త-వృత్తిఁ గలంగన్॥"

౬. ఎఱుకువయనఁగా జ్ఞానము. ఉదాహరణము—

,, క. ఎఱిఁగినఁ జేరఁడు చేరుట।
యెఱుకువయైమనకు న్దైవ-మిచ్చినసిరియు।
ట్లఱమిననీలోఁగ గ్రక్కున।
నఱకుమితఁడు దెగినమనము-నఃపీడ తెగున్॥"

ఎఱుక, ఎఱచి, ఎఱుకు, ఎఱక, ఎఱుకువయిత్యాదులు హ్రస్వైకారపూర్వములు.

ఎఱుఁగుటయనఁగా జ్ఞానము. ఉదాహరణము—

,, క. అఱువదియఱువదియమ్ములఁ।
నెఱకులునోనాడఁ జేసి-నిలిపితనరథం।
బెఱిఁగించిమువ్వురకున।
త్తెఱఁగద్భుతరసమువెల్లి-దేల్చెజనములన్॥"

శ్లో॥ హ్రస్వైకారముఖః పాతోనార్జవం పరివర్తనమ్।
శుష్కత్వగమ్మృదుఃక్రోశోఘర్షణం శకటాత్మకమ్॥ ౭॥

౧. టీ॥ పాతః=నేలకొఱగుట. ఉదాహరణము—

,, సీ. తనయార్పుబెలుఁగునఁ-దలఁకువైరులువోంగ,
న్గొఱిలు నేలకుఁదగ-నొఱగనేడు ..."

౨. అనార్జవం=ఒఱగె. అనఁగా వఙ్కరగానుండుట. ఉదాహరణము—

"క. అఱకటనిడిపాఱిజుమ్ఘుఁడై।
పఱచిజలధిలోనఁజదల-బాఱుసెడఁజే।
వఱిడప్పినిలువఁజాలక।
యొఱగినగాలవునిడించె-నొకగిరిమీఁదన్॥''

3. పరివర్తనం=ఒఱలుట ఉదాహరణము—

"క. నెఱిదప్పంబడిపెల్లుగ।
నొఱలెడినరవాజికరుల-యులీవఖిమన్యుం।
బఱిమిఱిబడుటకువగమదిఁ।
బఱిగొననిలపెలుచనఱచు-భంగిన్ జెలఁగున్॥''

౪. శుష్కత్వక్=ఒఱడు. ఉదాహరణము—

"ఆ. ఆలుబిడ్డలొఱడు-లైలేమిఁగుడుచుచుఁ।
దేవులుచేతబడుచునవయుజనులు ...'' అనియును.

౫. అమృదుః=ఒఱపుశరీరము. ఉదాహరణము—

"క. అఱగొఱలుగుఱుచచేతులు।
నొఱపుశరీరంబుగలిగి-యొరులకుఁజూడం।
గొఱగాకుండియుమన్మథు।
నొఱపులఁబడియెడునితండు-యువతీప్రీతిన్॥''

౬. కోశః=గంటపు ఒఱ. ఒఱవిడులు=అనఁగా నొఱలో నిముడనివారు. విధేయులు కారనుట. ఉదా—

"క. అన్నలుతమ్ములుగలుగుట।
యున్నతిజేయున్నృపునెంత-యొఱవిడులైనన్ ...

౭. ఘర్షణం=ఒఱయుట. ఉదా—

" ఆ. ఎలమిగడ చిపోవు-బిలుచుఁగ్రిమ్మరవచ్చి।
ముక్కు-ముక్కు-మీఁదు-మోపుజుట్టు।
నేచితిరుగునీక-లీకలతో రాయు।
నోఱయుఁజిత్రగతుల-మెఱయునవ్వ॥

నేలను ఒఱగె, ప్రతిభ మెఱగె, ఒఱలె, ఒఱదు, ఒఱపు, ఒఱలోకత్తి, ఒఱకట్టుకాయి, ఒఱగాలు, ఇవిప్రాస్వాకార పూర్వశకట రేఫములు.

శ్లో॥ తతఃకపూర్వోవత్యోమిశివ్రోమాలిన్యమేవచ।
దంశనంవిద్యాభ్యసనంమందశ్చపిటక స్తథా॥ ౮॥
" కార్యంఖడ్గాదిధారాచత్యోమంకృష్ణవృషాదయః।
క్షేపశ్చిన్నాని ఖర్వాణిదిగ్గలాప త్తథాకుధా॥ ౯॥
" భాగోరద్రైశ్చేదసంచకంటకఃకామ్యముల్కం।
కించిత్ప్రలోపఇత్యాద్యాఃకవిత్రయసమీరితాః॥ ౧౦॥

౧. శివః=కఱకంఠుఁడు. ఉదా—

" క. తెఱగట్టిదియో నామది।
నెఱుఁగమదాత్మోపహార-మిచ్చెదనీకుం।
గఱకంఠవరము నాకుఁబ।
గఱబరిమార్పఁగనుశక్తి-గలుగుటయసుమీ॥"

౨. మాలిన్యమ్=కఱ. అనఁగాకఱు. ఉదా—

" సీ. అతిమనోహరనవ-యౌవనారూఢుఁడై,
కఱలేనిహిమరశ్మి-కాంతిఁదాల్చి ..." అని.

కఱకొఱ=అనఁగాఁగశలము. ఉదా—

"చ. తఱమి సుశర్మతమ్ములును-దానును బోరికి నన్ను బిల్వనే।
నెఱుఁగని యట్టులుండుఁడిది-యే పురుషార్థము వారి నెల్ల నే।
ద్దైఱనుఱమాడఁబంపుముక-డిందిగఁజూడకు వాణి నేమియుం।
గఱో ఱగాదుపో మికడు-కష్టము నాకును దాత్తమానసా॥"

3. దంశనం=పులికఱచుట. అనియున్నందున 'నీలకఱచి, జాడుగఱచి' యనియుంగలదు. ఉదా—

"గీ. తోఱగువోకుండ మేకములు-గఱుఘకుండఁ।
బాడిపఱుగక యుండ నా-పాటిగొల్ల।
లెల్ల మెచ్చనీదృష్టికి-నెక్కెఁగదుపు।
నరయనేరుతునన్నేలు-ధరణినాథ॥"

౪. విద్యాభ్యసనం=విద్యకఱచుట. ఉదా—

"క. వెఱపెట్టిదియో యెన్నఁడు।
నెఱుఁగని నీయట్టివాని-కెవ్వరొగోయి।
పిఱికితనమింతయలవడఁ।
గఱపినవారనుచు శౌరి-కలకలనవ్వెన్॥"

"క. ఎఱుకగలవారిచరితలు।
గఱచుచు సజ్జనులగోష్ఠిఁ-గదలక ధర్మం ... " అని.

౫. మందః=కఱటి. అనఁగాఁమూర్ఖుఁడు. ఉదా—

"క. మఱచినఁదలపింపఁగనగు।
నెఱుఁగని నాడెల్లపాట్ల-నెఱిఁగింపవగున్।
మఱియెఱిఁగి యెఱుఁగనొల్లని।
కఱటిం దెలుపంగఁ గమల-గర్భునకశమే॥"

పిటకః=కఱటి. అనఁగాఁబుట్ట. ఉదా—

"వ. ఫలంబులుగోసి కఱటియునిండించి."

౭. కార్యం=అక్కఱ. ఉదా—

“ మ. నెఱయంబున్న మచెందురుం జెనయు నీ-న్నెమ్మోము దాదియ్యనై
చిఱునవ్వొప్పఁగఁ జూడ నీక పులకల్ - జెల్వొందఁ దన్గ్రుచ్చి యా।
కఱ్ఱదీరం బోరి నక్కఱ నంగరము వీ-కం జేర్ప నీకిమ్మెయిన్।
వఱుతం బ్రోవఁగఁ జేసె నేయకట! దై-వం బెందుఁ జోత్తున్న తా”

౮. ఖడ్గాదిధారా=కత్తికఱకు, గంటముకఱకు. ఉదా—

“ ఆ. కఱకుదర్భలు పూరి-గఱిపులు భిక్షాన్న।
మశనమట్టి నారి-నలి ముదమున।
నాదరించెఁ బ్రీతి-నాదిగర్భేశ్వరి।
యయ్యు సేవగింప-దయ్యె కృష్ణ॥”

౯. క్షామం=కఱవు. ఉదా—

“ క. కఱవు పయిఁగఱవుఁ బొరయుచు।
వెఱపు పయి న్వెఱపు దోఁప-విడువని యిడుమం।
దొఱగమి పురుషుం డిడుమం।
దొఱగమిఁ జేడ్పడుచు నడచు-దుష్కర్మములన్॥”

౧౦. కృష్ణవృషః=కఱియెద్దు. కఱియావు, కఱిమేక, కఱివేము, కఱియజీలకఱ్ఱ. ఉదా—

“ ఆ. మునుగ యుల్లి యడివి-మునుగ దుర్మాంసంబు
లానుగమ్ము మలిన-మైన యుప్పు।
కఱియజీలకఱ్ఱ-కఱివేము గురుజయుం।
గువును వజనీయ-కోటి యగును॥”

☞ ఇవి కపూర్వ శకటములు. ఇంక నీపయిన, కి, కు, కె, కొ, యనువర్ణములు క్రమముగాఁ బూర్వమందుఁగల శకటములు చెప్పఁబడుచున్నవి. ఆపైవర్ణములకు నిదే క్రమము.

౧౧. శ్లేషః=కిఱుపుట. అనఁగా శిలాదులరాప్పుట. కన్నుకిఱుపుట. ఉదా—

"క. కిఱుపు నెడ నేయు నెడవడిఁ।
బఱచు నెడఁ బెనంగు నెడన-పారబలంబుల్।
మెఱయు నెడ భీమునకునం।
దఱుగీడ్పడఁ జొచ్చిరుద్ధ-తను రాజసుతుల్॥"

౧౨. ఛిన్నాని=కొంచెము కొంచెముగా భేదింపఁబడిన కుఱుకులు. అనఁగా, కోతికొఱుకులవలెనున్న చిన్నముక్కలు. ఉదా—

"మ. విఱిగెం బెక్కురథంబు లొక్కమొగిను-ర్వింగూలె శుండాలముల్।
దఱుచై రాలెఁ దురంగమావయవసంఘాతంబు లింతింతలై।
కుఱుకుల్గొట్టె భటాంగకంబు లురణ-క్షోణిం బ్రవాహంబులై।
పఱచెన్నెత్తురు భూతకోటి విహరిం-పం బ్రస్తుతింపన్సురల్॥"

౧౩. ఖర్వాణి=కుఱుచలు. ఉదా—

"గీ. అద్భుతంబయ్యె నపుడు చే-యార్చి శౌరి।
లీలఁ గొందఱ మత్తశుం-డాలభంగి।
మెఱయఁ దూలించెఁ గాలను-గుఱుచతూఁపు।
గములఁ బార్థుండు పలువుర-సమయఁ జేసె॥"

౧౪. దిక్=దిక్కుఱ. అనఁగాదిక్కు. ఉదా—

"చ. పఱలఁగ రాముఁడంతనన-పద్యుఁడు వచ్చి బహుప్రలాపియై।
యఱచుచునున్న తల్లినిఁగ్ర-తాంతవశస్థితుఁడైన తండ్రిని।
క్కఱగని తీవ్రకోపపరి-ఖేదహృదుండయి తత్ప్రకారముం।
దఱిఁగి ముహూర్తమేని యుస-హింపఁగనోపక కోపదీప్తుఁడై"

దిక్కఱపదముచేత కెఱలియనియుందును. నిష్ఠా కెఱల్చె. ఉదాహరణము—

“వ. కశాఘాతంబునం గెఱలు నూకలాశ్వంబు చందంబున...”

అని. కెఱలుటయనఁగాఁ బ్రకోపించుట.

౧౫. జలాపత్=ఉక్కఱ. నీళ్ళలోమునిఁగి యుక్కఱపక్కఱ యయినాడని జనవాదము కలదు. ఉదా—

“క. వెఱచఱవనీటిలోను।
క్కఱగానొక ముసలిచూడిక్కఱ-కినగోచరమై।
పఱతెంచికుంభసంభవు।
జిఱుదొడవడిఁబట్టుకొనియె-శిష్యులు బెదరన్॥”

౧౬. క్షుధా=పక్కఱ. అనఁగాగజముపై చాడోలు. ఉదా—

“సీ. శౌర్యంబుగ దిరిప్రాగ్జ్యోతిషపతిచతు,
ర్దశతోమరములింద్ర-తనయుమీఁద।
నడరించుటయునవి-వాడి సేసి కిరీటియే,
నుంగుపక్కఱగడు-నుగ్గు సేయ।
నదిగప్పియున్న మే-ఘావళివిచ్చిన,
కొండచందంబున-నుండె...”

సాంటి ఉక్కఱ. కొక్కఱ=కొంగ. ముక్కఱ=ముక్కుకమ్మి.

౧౭. భోగః=కొఱలుట. ఉదా—

“క. ఎఱిఁగెడువారికినైనం।
గఱపకతక్కఱుచిత్రప్ర-కారము శుభముం।
గొఱలుహితులట్లగుటనం।
దఱకును జెప్పంగవలయుఁ-దగియెడుబుద్ధుల్॥”

౧౮. రదచ్ఛేదనం = పళ్ళతో కొఱుకుట. ఉదా—

“సీ. కాలమేఘంబును-బోలె విశాలమై,
నీలమై దేహంబు-గ్రాలుచుండ।
ఘనతటిల్లతలయ-ట్లనిమిదిదంష్ట్రలు,
మెఱవంగఁబండులు-గొఱికిపెలుచ...”

౧౯. కంటకః = కొఱ్ఱు. కొఱత. ఉదా—

“క. సొలయక తూనీగలఁగొ।
ఱ్ఱులఁబెట్టితినీవునీచి-ఱుతకాలముత।
త్ఫలమిప్పుడనుభవించితి।
తొలఁగునెహింసాపరులకు-దుఃఖప్రాప్తుల్॥”

కొఱ్ఱు ప్రాసములో లేనప్పటికిని ద్విత్వమున్నది గనుక సంశయము లేదు.

౨౦. కాష్ఠం = కొఱ. కొఱగామి, కొఱగాక, ఉదా—

“క. అఱగొఱలుగుఱుచ చేతులు।
నొఱపుశరీరంబుఁగలిగి-యొరులకుఁజూడం।
గొఱగాకుండియు మన్మథు।
నొఱపులఁబడియెడునితండు-యువతీప్రీతిన్॥”

౨౧. ఉల్ముకం = కొఱవి. ఉదా—

“క. కొఱవియుఁగొఱవియుఁదాకిన।
తెఱఁగుననర్జునుఁడు సురన-దీసూనుఁడుఁజా।
పఱువొగడఁగఁదాఁకుటని।
ద్ధరదిక్కులసైన్యములును-దలపడియొవడిన్॥”

౨౨. కించిత్ప్రలోపః=కొఱఁత, కొఱంత ; ఉదా—

“క. తఱిమి పయినడరుటయు విలు।
విఱుగంగాఁ జేసె నతఁడు-విక్రమలీలం।
గొఱఁత పడనీక కర్ణుఁడు।
మెఱుఁగుల దొరు శక్తి సేరలు-మెచ్చఁగ నేసెన్॥”

ఇవి నన్నయభట్టాదిప్రోక్తకకారపూర్వశకటరేఫములు. రాముని కొఱకు అనికలదు. కుఱులు= వెండ్రుకలు.

శ్లో॥ ద్విషోంతికం పరిక్రామోభిజ్ఞానం లక్ష్యమేడకః।
గాదినే తాన్ని జగదుః కవయో వైత్రియోజయే॥ ౧౧॥

౧. టీ॥ ద్విషః=పగఱ. ఉదా—

“క. తెఱఁగెట్టిదియో నామది।
నొఱఁగ మదాత్తోపహార-మిచ్చెద నీకుం।
గఱకంఠవరము నాకుఁబ
గఱఁబరిమార్పఁగను శక్తి-గలుగుటయ సుమీ॥

౨. అంతికం=దగ్గఱ. ఉదా—

“క. వెఱచఱచి వెఱఁగుపడిని।
వ్వెఱగందుచుఁ గురుబలంబు-వీరులత నిడ।
గ్గఱ నంతనంతఁ జూడఁగ।
నుఱక నదీసుతుఁడు దాకె-నుద్భటభంగిన్॥

3 పరిక్రమః=గిఱిగొనుట. అనఁగా చుట్టుకొనుట. ఉదా—

“క. ఉఱక మదీయాంగంబులు।
గిఱిగొన నల్లేయుటయును-గినుక గదిరిన।
న్నెఱుఁగారు సారసంబులఁ।
దఱుచుగ నించితిగడంగి-అర్ధ్ధాత్రమునన్॥”

౪. అభిజ్ఞానం=గుఱుతొనుట, గుఱుతుపట్టుట. ఉదా—

"క. మఱియును నొకనాఁడెవ్వరు।
నెఱుఁగక యుండఁగఁ గౌరవేంద్రుఁడు దర్పం।
బెఱుఁగక విషమన్నముతో।
గుఱుతొనిపెట్టించెఁ గాఁడు కొడుకునకలుకన్॥"

౫. లక్ష్యం=గుఱి. ఉదా—

"సీ. గుఱియైన చెలువుర-నెఱసిన లోకర,
క్షణమున గరళంబు-చాయఁదోఁప।

౬. ఏడకః=గొఱ్ఱె, గొఱియ. ఉదా—

"గీ. గొఱియనంజుడుఖడ్గంబు-నెఱచిగండ।
మృగమునందలిపలలంబు-మేకమాంస।
మొకట్టొకట్టిఫలమున-కెక్కుడౌండ్రు।
పితృసమర్చనవిదులైన-పెద్దలధిప॥

ఇవి గపూర్వశకటములని భారతమందు ముఖ్యరుకవులును జెప్పినారు. గిఱిగొనుటయున్న దిగనుక గిఱిగీసి, గిఱగిఱ, అనియును గలదు. గిఱుకుచ్చున, గిఱాలున ననియుంగలదు. తలగొఱిగెననియుండును. ఏడకః యను క్రిమముగా నొత్త్వములోఁ బడినదిగనుక గొఱ్ఱె, గొఱియ, యని చెప్పవలసినది గాని తగఱు అని చెప్పరాదు. తగరు రేఫములో చెప్పవలయును.

శ్లో॥ శైఘ్ర్యమాస్ఫాలనం శైలతటంచశిశురగ్నిమత్।
కారాపీడాహరిదశ్చాగ్రంచపూర్వంశకటం స్మృతం॥

౧. టీ॥ శైఘ్ర్యం=క్రచ్చు. క్రచ్చు అయినచోట చకారముతోడను నకారముతోడను విరతిగలదు. ఉదా—

"చ. చిఱుతతనంబునందగవు-చిత్తమునందలపోయలేకముం।

దఱనటువోవనిచ్చితిబి-తామహుఁడుంజనకుండునింకగ్ర|
చ్చఱనిలవంచిచక్కనగ-మక్కడనెవ్వరికేనిమద్బలం|
బెఱుఁగఁగనీదలంచినను-సేనదియేటికిసమ్మతించెదన్॥

క్రించఱయనియుంగలదు. ఉదా—

గీ. పగఱఁగనిసైతురేనియు-మ్మగకులంబుఁ|
గనిసహింపరురాజులు-నొనసివానిఁ|
గ్రంచఱంగఁజంపుదురని-మ్మించిచంపఁ|
జనదుమాయాచ్ఛలంబునఁ-జనదుచంప॥"

౨. ఆస్ఫాలనం=చఱచుట. ఉదా—

క. వెఱచఱవఁబట్టికొనివడి|
జఱచిజరాసంధుసంధి-సంధులయెమ్ముల్|
విఱిచివిదళించియార్చెను|
ఘల్లఁగభీముండుభూమి-వలయంబద్రువన్॥"

3. శైలతటం=చఱియ. ఉదా—

సీ. ఉర్వీధరంబుల-నొప్పెడుజేవురు,
జఱులకాంతికినను-మెఱుఁగువెట్టి|

౪. శిశుః=చిఱుతవాఁడు, చిఱుతపులి, చిఱుదొడ, చిఱివెం
డ్రుకలు, చిఱచిఱ, చిఱుగుబట్ట. ఉదా—

చ. చిఱునగవొప్పగాండివముఁ-జెచ్చెఱసజ్యముజేసిసేనలు|
కఱ్ఱరభసంబుమైనడరఁ-గవ్వడిద్రోణియునీడవోకన|
తఱిఁదఱుమంగశస్త్రములు-దండడిఁదార్కొని
ముందుచుండఁజి|
చ్చఱపిడుగుల్పడిందొరుగు-చొప్పననంబరవీధినుగ్రమై॥

౫. అగ్నిమత్=చిచ్చఱకన్ను. అగ్నిమయనేత్రమనుట. చుఱ
చుఱ, చుఱుకు, చుఱుక్కు-అనియుఁగలదు.

౬. కారా=చెఱ, స్త్రీ చెఱ, చెఱుకుకట్ల, చెఱుకువిలు తుఁడు. ఉదా—

“క. నఱకుటయర్థముఁగొనుటయుఁ।
జెఱనును మిటకట్టియడచి-చేట్పాటొందం।
బఱచుట మొదలుగఁగలపలు।
తెఱఁగులఁడగవు మెయినడపు-ధీరవిచారా॥”

౨ ఉదా—

“సీ. కలియక పోడు చుట-కల్మషమంగనఁ,
జెఱవట్టఁదగి దువి-శేష మొకఁడు॥

అని మొదలగునవి.

౭. పీడా=చెఱచుట. ఉదా—

“క. మఱతురె కోలువున ద్రౌపదిఁ।
బఱచినబన్నములు ధర్మ-పథము దొలంగన్।
వెఱచుటకప్పటికదితగుఁ।
జెఱచినచో వెదక వలదు-చిరతరకీర్తిన్।”

౮. హ్రదః=చెఱువు. ఉదా—

“క. చెఱువునడుమవసినను పెను।
వెఱమ్రుగములు బెదరిననువి-వేకనిధియుఁ।
క్రూరబహులసైన్యమఱిమఱి।
బఱచిననాగంగరాదు-బలియుర్కైనన్॥”

౯. అగ్రం=చెఱఁగు. చెఱంగు. ఉదా—

“గీ.* అవనిగంపింపలలితపీ-తాంబరంబు।
చెఱఁగుదూల చక్రాంశులు-దుఱఁగలింప।
సింహనాదంబు క్రోధరం-జితభయంక।
రాననంబునఁ జెలఁగంగ-నడరెఁ జెలువ॥”

౨ ఉదాహరణము—

"గీ. నేలనాలుగుచెఱఁగులున్న పుత్రికోలువు ;

ఇవి చపూర్వ శకటరేఫములు—

శ్లో॥ యానంచచక్రభ్రమణంజపూర్వంపాయసాదనం।

టీ॥ ౧. యానం=జఱుగుట, జఱుగుబాటు, కాలంబు జఱపె జఱజఱ, ఇత్యాదులు.

౨ చక్రభ్రమణం=జిఱజిఱందిరిగె.

3 పాయసాదనం=క్షీరాన్నము జుఱజుఱజుఱ్ఱుట.

ఇవి జపూర్వశకటరేఫములు—

శ్లో॥ శాకాదిచ్ఛేదనంసాంద్రంతరణంలోపఏవచ॥. ౧౩॥

అభిక్రమశ్చకాలశ్చప్రకాశోధూర్తఏవచ।

ముఖావృత్తంచవిచ్ఛిత్తిరవకాశోంగనారయః॥ ౧౪॥

సకర్తకప్రయోగేతుత్యాగఃకోటరమేవచ।

తకారపూర్వనాచఖ్యుర్మహాభారతకారిణా॥ ౧౫॥

౧. టీ॥ శాకాదిచ్ఛేదనం=కూరతఱుగుట, తలదఱుగుట. ఉదా—

"క. వెఱఁగుపడికుంభభవుఁడుం।

బెఱరధికులుచూచుచుండ-బీరములావు।

న్నెఱయఁజలము నెఱయఁగఁదలఁ।

దఱిగెదసైంధవుని నేల-తలకెదుక్కన్నా॥"

౨. సాంద్రం=తఱుచు. ఉదా—

"సీ. తఱుచుటమ్ముల నేదు-లెటఁగినచందంబు,

జేసెరయంబునఁ-జిత్రసేను।

ఏదుపంది తనమీఁదఁబడినట్లుచేసినాడనుట.

3. తరణం=తఱియుట. అనఁగాసముద్రాదులుదాటుట ఉదా—

"గీ. అరసికొనియెన్నిభంగుల-నైనవేని।
తేరుమనకారికగుపడు-తెఱఁగుఁగాంచి।
యహరిబాసటనైయెవ్వ-రడ్డపడిన।
మెఱుపుమెఱసినచాడ్పునఁ-దఱియఁజోరము॥"

4. లోపః=ధాన్యాదికముతఱుగుట. ఉదా—

"గీ. తొఱగువోకుండ మెకములు-గఱువకుండ।
పాడిదఱుఁగకయుండ నా-పాటిగొల్ల।
లెల్లమెచ్చనీదృష్టికె-నెక్కుఁగదుపు।
నరయనేరుతునన్నెలు-ధరణినాథ॥"

ఈపద్యములో తఱుగుట ప్రాసలో లేదు పూర్వపద్యమే యుదాహరణము. సముద్రంబుతఱిసె, తూనికతఱపె నీరంటికిని తక్కువయందు తాత్పర్యము.

5. అభిక్రమః=తఱుముట. ఉదా—

"క. పెఱవారినెల్లఁదరిమిడి।
నఱుకుదుఁబాండుక్షితీశ-నందనులనురూ।
పఱనేయఁజేతులాడవు।
తఱుమరునామీఁదనత్యు-దగ్రతవారల్॥"

6. కాలః=తఱి. ఉదా—

"క. వెఱఁగుపడిహర్షరాగము।
దఱిగినవెలవెల్లనైవ-దనములువాడెలం।
దెఱఁగేదిరిచ్చవడియు।
తఱిఁదత్పరిజనములెల్లఁ-దద్దయువంతన్॥"

7. ప్రకాశః=తుఱగలించుట. ఉదా—

"క. మఱునాడయావుటలెస్సగ।

నెఱిఁగనినుండపుడు వేడి-యొడలిఁజీప్తుల్।
దుఱిగలిఁగొని పశ్చిమగిరి।
చఱికినన తిదూరమునవి-శదుఁడైతోచెన్॥''

౮. ధూర్తః = తుఱుసు. ఉదా—

ఆ. ఎల్లవారు నెఱుఁగ-నెల్లనిధర్మంబు।
తెల్లనీకు నెఱుఁగ-నేలవలసెఁ।
జెఱుత వానికెంత-తుఱుసటితనములు।
సన్నె వృద్ధజనము-లున్నెనోట॥''

౯. ముఖం = వాతెఱ. ఉదా—

చ. నెఱిక్రురులున్ విలోలసిత-నేత్రయుగంబును జాలనొప్పు వా।
తెఱయును నాదినిఘ్రాణనముఁ-దెల్పు గరంబు మనోహరంబు నే।
నెఱిఁగినయంతనుండి సతి-నిట్టిలితాలలితాంగిఁ జూచియే।
నెఱుఁగ సురేంద్రకన్యకలు-నిట్టిరెరూపవిలాససంపదన్॥''

౧౦. వృత్తం = తెఱఁగు. ఉదా—

క. వెఱువక సంకేతించిన।
తెఱఁగుననయ్యెడకు నరుగు-దెంచునోకోకాం।
దఱిఁదెచ్చునోకొ-వెడఁగై।
యఱిముఱి వెలిఁబుచ్చునోర-హాస్యంబెల్లన్॥''

"క్వచిద్గకారోవః" అని యున్నది గనుక తెఱవు అనియుం గలదు. ఉదా—

క. పెఱవారలుద్ధగు నొలఁగెడు।
తెఱవులు దొరకొన్న వింత-తెఱవులు నేర్పు।
తెఱయుము ముఁబటచిత్తముఁగొన।
నోఱపుఁ గలిగిమాన్యవృత్తి-నుండుదు బతిగన్॥''

తెఱవ మనియును గలదు.

౧౧ వివృతిః = తెఱపుట. ఉదా—

"క. ఎఱకలు విచ్చుచుఁ దుండము।
దెఱచుచుఁ బ్రేగడరి సొగసి-దిగ్గిల్లి వివశుఁడై।
యఱచిన నోడకుమని హరి।
నెఱిసక్కఁగఁ ద్రోచి యెత్తె-నెగయం గృపతోన్॥"

౧౨. అవకాశః = తెఱపి. ఉదా—

"చ. ఉఱక నరుండు ద్రోణసుతు-యుగ్యముల న్వెస నొంచె
నాతఁడుం।
దెఱపియొకింత గాంచి ఘన-తీవ్రశరంబున నారిఁ ద్రెంచి కి।
న్నెఱిపిన మాత్రలోన యత-నింబటు బాణచతుష్క యుగ్మమే।
ద్దెఱఁదొడి మార్వ్రక్కమ్మఱఘ-టించు నెడన్వడి నేసి యార్చెనన్॥

అనియున్నది.

౧౩. అంగనా = తెఱవ. ఉదా—

"క. తెఱవల ముట్టములయ్యెడ।
రెఱచియ భుజియింతురధిక-నెల్లజనంబుల్॥"

౧౪ రయః = ఏద్దెఱు. ఉదా—

"చ. ఉఱుము చు నెల్లెడం బిడుగు-లుగ్రగతిం బడ ఘోరమూర్తియై।
యఱిముఱిగప్పె దెం మవిల-యాభ్రము చాడ్పున
మార్గ్గనాదమే।
ద్దెఱఁ జెలఁగన్వడిం దొఱఁగ-దివ్యశరంబులు దేరుద్రోణు పై।
బఱపు కిరీటి మీధరణి-పాలక జోదులు చేత నిల్చునే॥"

౧౫. త్యాగః = తొఱఁగుట ఈశబ్దము సకర్మక ప్రయోగము నందు త్యాగార్థమయిన శకటరేఫము. భగవద్భక్తుఁడు దుఃఖంబుఁ దొఱఁగె. భక్తిహీనుఁడు పుణ్యంబుఁ దొఱఁగె. ఉదా—

,,చ. మఱియొకఁడేను చెప్పెదన-మానుషవిక్రమలీలనల్గడల్।
బఱపియుఁజంపియుఖ్ రిపున్వ-పాలక సైన్యము రూపడంచి మే।
న్దొఱఁగుటయొప్ప దేతనువు-దూఁటులుగా నెఱవాడి గెల్పుకో।
లుఱవ్రో శ్రో నాదు పెంపుడుప-నోపుదు రేమి ముజోఁటు
తెమ్మొయిుఁ॥"

౧౬. కోటరం=తొఱ్ఱ, తొఱ్ఱ, తెఱనోటి మొక్కము, తెఱగం
టిమూఁక. ఉదా—

,,క. జాతుఁడు మృతుఁడగుటధ్రువము।
భూతోల్లాసములనిత్య-ములువినుషద్య ః।
పాతియగు శరీరమ్మున।
కైతొఱఁగు నెగ్గ్ ర్మపథము-నార్యుండధిపా॥"

ఇందులో తొఱఁగుటయని వ్రాసియున్నది తృతీయవర్ణము కాదు.
ఇవింగాన్నియును ఱకారపూర్వములగు శకటరేఫములు.

శ్లో॥ ఉభావియంతస్సర్వేచకియంతఃకతిచాగ్రతః।
జ్యేష్ఠత్వకన్యాత్వాద్యాశ్చదపూర్వాశ్శకటాస్మృతాః॥

౧. టీ॥ ఉభౌ=ఇద్దఱు. ఉదా—

,,క. మఱియొకఁటి చెప్పెదని।
ద్దఱుఁగృష్ణులఁజంపి వారి-ధనములు నాకి।
త్తఱిఁదద్రధ మిదియోయని।
యొఱఁగించినయతనికిత్తు-నేనుముదమునఁ॥"

౨. ఇయంతః=ఇందఱు. ఉదా—

,,క. ఎఱుఁగమిఁజేఁకటి నేఁడె।
ద్దఱిక్కంబుఁదలంచియేమి-తప్పగఁబిగినఁ।

మఱచిదయఁజూడుమిట్లిం।
దఱునీకుంబనులుసేయఁ-దగుదురువీరల్॥"

3. సర్వే=అందఱు. ఉదా—

" క. .........                    ।
............                    అం।
దఱనుగ్గుజేసెగుంపుల।
కుఱికియుఘనఖడ్గధారు-ణోల్లాసమునన్॥"

౨. ఉదా—

" క. తెఱపిఁగొనినీవుసొచ్చిన।
పిఱుఁదనజొచ్చెదమురిపులు-పెల్లగిలఁగనం।
దఱమునుమాకిదియెంతయు।
నుఱునట్టివరంబుదీని-నొసఁగుముపుత్రా॥"

౪. కియంతః=ఎందఱు.

౫. కతి=కొందఱు. ఉదా—

" క. ఎఱిఁగిననప్పెనువేఁగున।
విఱుగుటయునుశాఖఁజూచి-విహగేంద్రుఁడుకొం।
దఱుమునులనందుఁగనుఁగొని।
వెఱపునవాత్మీయచిత్త-వృత్తిగలంగన్॥"

౬. అగ్రతః=ముందఱు. ఉదా—

" చ. ఉఱుడుసురేంద్రుడైనబలి-యుండుపిండింబుఁడువానివాడికి।
న్వెఱువనివారునుంగలరె-వీరలుముందఱుంగరక్రటా।
రెఱిఁగినయేనివీరుతమ-యిండులనిద్రితులైనయట్టులే।
మఱిశయనింతురేకదుప్ర-మాదముఁజేసిరిబుద్ధిహీనులై॥"

౨. ఉదా.

"చ చిఱుతతనంబునందగువు-చిత్తమునందలపోయలేకముం।
దఱనటువోవనిచ్చితి......"

౭. జ్యేష్ఠత్వం=పెద్దఱికము. ఉదా—

"క. ఎఱుఁగమిఁజేఁకటి నే బె।
ద్దఱికంబుఁదలంచియేమి........."

౮. కన్యాత్వం=కన్నెఱికము, రాచఱికము, మాలఁతీకము, పేదఱికము, పేదఱిమి. ఉదా—

"గీ. తగు నెయర్జునయీపండ-తనము నీకు।
ధండి వై లెమ్ము మనసు పే-దరిమి విడిచి।
యనిననట్లున్న భంగిన-యల్ల నిట్టు।
లనియె నాతండు పుండరీ-కాక్షుతోడ॥"

౯. మేనఱికము, హెచ్చుఱికము, చుట్టఱికము, లేఁతఱికము, బాలఱికము, ఇల్లఱికము, కోడఱికము, కమ్మఱికము, చిన్నఱికము. మొదలగునవి దకారపూర్వములు కానప్పటికిన్ని గ్రాహ్యములు.

శ్లో॥ ఖండనంధూళనంచైవ వక్షోదనంచాస్తిచాలకాః।
నిజంస్ఫుటంప్రకాశోవాసపూర్వాశ్శకటాస్స్మృతాః॥

౧. టీ॥ ఖండనం=నఱకుట. ఉదా—

"క. వెఱనరిగిననిలువక వెస।
నుఱికిందనరథమునొంది-కోడితిఁబోపో।
పిఱికియనిపలికినుఱుముగ।
నఱకెందతేనపార్థ-నందనుఁడుఁ జడిఁ ॥"

౨. ధూళనం=నఱుము, నలియయిరనుట. ఉదా—

“చ. అఱిముఱిఁ ద్రెళ్ళెఁ దేరులుఁగ-జావళిఁగూలెఁ దురంగమాంగముల్
గిఱిగొని యస్త్రహీన భటులు-లెక్క కుమిక్కిలి సేనబాడుగా।
నఱుమయిర పృథుకృష్ణుఁడుని-నాదము భూగగనాంతరంబునం।
దఱచుగ నొత్తెని ర్దళిత-దానవసైన్యముఁ బాంచజన్యమున్॥”

౩. క్షోదనం=నుఱుము సేయుట, నులిపెననుట, చూర్ణము చేసె
ననుట. ఉదా—

“ఆ. నుఱుము సేయనిట్లు-నెఱయఁగ సత్వంబు।
మెఱయ జత్రువవల-నుఱకఁబవన।
తనయుఁడరిగెఁ బగలు-సనునట్లు చీఁకటి।
యనక ముండ్లు గండ్లు-ననక దెరలి॥”

౨. ఉదా—

“గీ. నుఱిపె నెత్తురు పేరులు-వఱపి భీమ।
సేనమాయన్న బకుని నా-లేనిచోట।

౪. అస్థి=నెఱకు, నెఱ. అనఁగా యెముక. ఉదా—

“క. అఱిముఱి నొండొరు వ్రేసిన।
నెఱకులు దాకుటయు నొచ్చి-నేలకొఱగి బ।
ట్రఱియా సుభటద్వితయము।
వెఱచఱచి ఖలద్వయంబు-వెఱఁగొందంగన్॥”

౨. ఉదా—

“ఆ. వెఱఁగుపాటుదనికె-నెఱనాటినొప్పినె।
ఝ్వగలువగల.........”

౫. అలకాః= నెఱులు. ఉదా—

" వ. పెన్నెఱివేణిముడుపనుఱిదగు వారి నియోగించె."

౬. ఉదా—

" చ. నెఱికురులున్విలోలసిత-నేత్రయుగంబునుజాలనొప్పఁగా।
తెఱఁగును........."

౭. నిజం= నెఱి, నెఱకువ. ఉదా—

" క. నెఱినుఱకవైరివీరుల।
నెఱకులుదూరంగనేయు-నృపపుంగవునం।
పఱతలుచుకోపకాంతయు।
వెఱఁబొందివివర్ణులైరి-విషయాధీశుల్॥"

౮. స్ఫుటం= నెఱ. ఉదా—

" సీ. కఱువఱ్ఱిసుడియమింగఁదలక జెన్నొందు,
నెఱవిడితమ్ములనుఱక దెగడి॥"

౯. ప్రకాశో వా= నెఱయుట. ఈశబ్దము ప్రకాశార్థమైన శకటరేఫము. సంయోగార్థకమైనయెడల శకటము కాదు. ప్రకాశార్థమందుదాహరణము—

" క. నెఱయఁబ్రధానపదార్థము।
లెఱుఁగుటపరబోధమూల-మెఱుకలకెల్లన్।
మెఱుఁగిడుటమమ్ముమువ్వర।
గుఱుకొనియొక్కఁడుగ నెఱిఁగి-కొనుటదలంపన్॥"

రేఫమునకుదాహరణము—

" క. తరళనయనాబ్జదళములు।
నెరయగబైమున్ను........." అని.

ఇవిమొదలయినవి నకారపూర్వశకటరేఫములు.

శ్లో॥ దారితోర్వాచకశిపుః ప్రేక్షకాశ్శ్వరసంచయాః।
గమనప్రభృతిః పశ్చాద్భిత స్తృప్తిః పర స్తథా ॥ ౧౭॥
శణవల్కలపాత్రంచ దంతాద్యుత్పాటనంతథా।
పకారపూర్వం శకటం జగుర్భారతపారగాః॥ ౧౮॥

౧. టీ॥ దారితోర్వా=పఱియలైనది. బద్దలు చేయబడినదనుట. ఈశబ్దమున్ను దారితార్థకమైతే శకటము. మఱియొక యర్థమందు శకటరేఫము కాదు.

దారితార్థమందు ఉదా—

“ గీ. పఱియవాపంగొందునియగా-విఱువ్వవలయు।
నెడలఁగాళ్లను జేతులఁ-దొడలఁ బెట్టి।
కడఁగియనువుగఁ జేసి ప్రా-ఖ్యు డెఱుగు గాని।
కత్తిగొడ్డలియడుగనే-గట్టియలకు॥”

“ క. ఎఱిఁగిపిఱుసనినవెసఁబై।
కుఱుకుదుసాళువము కాకి-నొడిసినభంగిన్।
వెఱచఱువఁబోవుదుంబఱి।
పఱిసేయుదునీదుపూన్కి-పారం జేదన్॥”

౨. కశిపుః=పఱుపు. ఉదా—

“ ఆ. కఱుకుదర్భపూరి-పఱుపులుభిక్షాన్న।
మశనమట్టివారి-నతిముదమున...”

౩. ప్రేక్షకాః=చూపఱులు. ఉదా—

“ క. కొఱవియుఁగొఱవిద్ధియుఁదాకిన।
తెఱఁగుననర్జునుఁడుసురన-దీసూనుఁడుఁజూ।

పఱువొగడఁగఁదాకుటని।
ద్దఱదిక్కులసైన్యములును-దలపడియెవడిన్‌॥"

చూపరి=చూపరులు. ఇవి ఆద్యంతరేఫలలో వ్రాయఁబడుచు
న్నవిగనుక శకటములుకావు.

౪. శరసంచయాః=అంపఱ. ఉదా—

" క. నెఱినుఱకవైరివీరుల।
వెఱకులుదూరంగనేయు-నృపపుంగవునం।
పఱతెరచుకోపికెంతయు।
వెఱపొందివిషణ్ణులైరి-విషయాధీశుల్‌॥"

౫. గమనే=పఱచుట, పఱుగునేళ్ల, పఱువులంవాఱుట, పఱు
గుడుపాము, పఱతెంచె, పిఱకటతట్టు. ఇది యకర్మకక్రియ. పఱ
చెననఁగాఁగఁ ద్రిర్ధకము. పఱపెననఁగాణిజర్థకము. ఉదాహరణములు.

" గీ. అంగములబాణములునించి-యతనిఁబఱపె॥"

౨. ఉదా—

" గీ. ఉఱకయఱువదియమ్ములు-పఱపెమేన॥"

౩. ఉదా—

" క. మెఱుపుధనుర్దండముగుణ।
ముఱుమువిశిఖవృష్టిదొరగు-నొక్కటతఱుచై।
వీఱపెరుధిరంపుఁగాల్పవ।
లఱిముఱిఘనభుజుఁడుద్రోణుఁ-డడరినరేంద్రా॥"

సమ్మతిపరచె, వెలువరచె, లోఁబరచె, వెలువరించె, నిలువరించె,
ఫలపరతు, పాలువరతు, మేలువరతు, ఏపుపరతు, మార్పరచెద,

మారుపరచెద, అలవరపు్రము, సమ్మతిపడె, వెలువడె నిత్యాదులు కర్త్రర్థములు. సమ్మతిపరచె నిత్యాదుల్లు ణిజర్థకములు. ఉదా—

,, గీ. పరశురాముని కోపంబు-బాణశక్తి।
గ్రావబాంహ్మణశాపంబు-రథముఁజిక్క-।
వఱపగాండీవధరుఁజేతి-పఱపుటమ్ము।
మన్ని గొనియె నెయ్యొకర్ణ-మఙ్గలరాఙ॥"

౨. ఉదా.

,, చ. పఱచుందవ్వుగఁ జేయులంతనిలుచుం-బట్టీకయాపొపగాఁ।
బిఱువోవుంబొదలందుడిందుబోఢముం-బెట్టులి వేదాటుఁగ।
మ్మఱిచూచుం జెవిదార్చినిల్చుమలయు-నట్టాడుగోరాడునే।
ఘఱినట్లుండుఁద్రుణంబులాను నెలదము-న్మాయామృగం
బిమ్ములన్॥"

పిఱువోవుననఁగా పిఱుందుకుఁబోవును. గోరాడుమ అనఁగాఁ గొంచెమాడును. కోరాడుననిన బయలనాడును.

౬. పశ్చాత్ = పిఱు, పిఱుద, పిఱుంద, పిఱుదు. ఉదా—

,, క. తెఱపిగొనినీవుసొచ్చిన।
పిఱుదనజొచ్చెదము........,"

౭. భీతః = పిఱికి. ఉదా—

,, గీ. పిఱికితనము నేమఱుటయు-నఱపత్వనము।
మెత్తబాటును గార్శ్యంబు-నెత్తెఱుంగ।
నేరమియు విషయంబులు-గూరుటియును।
గల్గుపతికిసుండఁదుఁదిదిఁ-తొలఁగిపోవు॥"

౯. త్రృప్తిః=తెప్పిఱిలుట. ఉదా—

"క. పెఱికిఱినలుగులు మేనులు।
నెఱిఁబడ నెల్లెడలుగలయ-నిమిరితిహారులి।
త్తఱినీళులు ద్రావక తె।
ప్పిఱివెట్టిఁ శత్రుసైన్య-భీషణమూర్తి॥"

౧౦. పరః=పెఱవాఁడు. అన్యుఁడనుట. ఉదా—

"క. పెఱవారలుదగు మెఱఁగఁడు।
తెఱవులుదొరకొన్న వింత-తెఱవుల నేర్పుల్।
మెఱయు మఁబఱిచిత్తముఁగొన।
నొఱపుఁగలిగిమాన్యవృత్తి-నుండుదురుదగన్॥"

పెఱుగున్న, పెఱదున్న—

౧౧. శణవల్క-లపాత్రం=పెఱికె. అనఁగా జనపనారతో నేసిన గోనె యనుట. ఉదా—

"చ. మఱియునునన్నిధంగలస-మంచితకాంచనరాశిబండ్లనుం।
బెఱికెలమోపులంగొలఁది-వెట్టఁగఁబెక్కగుభారువుల్లను।
ల్వెఱఁగుపడంగఖేచరులు-వెక్కసమందఁగశత్రుకోటికి।
న్వెఱపొనరించువార్తబృధి-వింబరగిన్న డపించెభూవరా॥"

౧౨. దంతోత్పాటనం=కోరలు వెఱుకుట, చెట్లు వెఱుకుట. ఉదా—

"క. పెఱికితినలుగులు మేనులు।
నెఱిఁబడ........॥"

పెఱికివాండ్లు. ఇవి మొదలయినవి పకారపూర్వ శకటరేఫములు.

చదువులబఱి, బఱిమేన, తలబఱుకోట, చింతబఱికె. ఇవి బహుగ్వశకటములు

శ్లో॥ బహ్వావృత్తిద్విరావృత్తిః ప్రమాదో విస్మృతిః పునః।
ఆచ్ఛాదకః కవచశ్చర్యాపరేద్యుః ప్రతిభాషణమ్॥ ౨౦॥

దృగ్భ్రంశోప్యన్యశోర్ద్వచనాతివ్యాప్తంవ్రజస్తథా।
ప్రకాశశ్చతటిద్గాధమాచ్ఛాదోమూర్ఖఆర్తవాక్॥

శకటాన్పఞ్చికటానూచుర్భారతప్రాసగామినః।

౧. టీ॥ బహ్వావృత్తిః=పలుమఱు. వేమఱు అనిన్ని కలదు.

ఉదా—

" క. విఱుగుటనొచ్చుటమనదెసఁ।
దఱుచుగ నాడెదవు పాండు-తనయులబలమే।
ద్తెఱఁదఱుగఁగ పెనఁగుటఁబలు।
మఱుఁజెప్పెదవకటయేమి-మాయయొతలఁపన్॥"

౨. ద్విరావృత్తిః=క్రమ్మఱుట. అనఁగా తిరిగియును మళ్ళుట.

ఉదా—

" చ. పఱచుందవ్వగఁజేయలంతినిలుచుం-బట్టీకయాసాసలం।
బిఱువోవుంబొదలందుడిందుఁబొడముం-బిట్టుల్కి—
వేదాటుఁగ్రగ।
మ్మఱిచూచుంజెవిదార్చినిల్చుమలయుం-న్మట్టాడుఁగోరాడునే।
మఱినట్లుండుఁదృణంబులాను నెలయుం-న్మాయామృగంబిమ్ములన్

౩. ప్రమాదః=ఏమఱుట. అనఁగా పరాకు. దీనికుదాహరణము పైపద్యమందేకలదు.

౪. విస్మృతిః=మఱపు, మఱువకు, నీయాడినమాటమఱాకుమన్న,

మఱకువ. ఉదా—

"క. ఎఱుకనిరెుఱుఁగకనీకు।
న్మఱకువనెదిరించినాఁడ-మఱువుముదీనిం।
గఱకంఠాక్షమియింపుము।
నెఱినెవ్వరికెఱుఁగఁదరమె-నీచరితంబుల్॥"

౫. పునః=మఱి, మఱియు. ఉదా—

"క. మఱికొంతసేపునకుఁ దా।
ప్పఱిలేచిముకుందుమేను-బెద్దయునుంబ్రో।
ద్దఱియంగాఁగిటఁజేర్చెన్।
బఱిషోయినతాల్మిమున్ను-బాష్పములురులన్॥"

మరి యనునది పర్యాయార్థమున శకటరేఫము కాదు. ఉదా—

"క. ధరణియుగస్వపవైశ్వా।
నరమరుత్కుండేయులాలి-నజగద్ధితవ।
కృతులైరోకొ-డదారోక।
మరిగోష్ఠీవిరతినుండి-మనుజాధీశా॥"

౬. ఆచ్ఛాదః=మఱుగు, మఱువు. ఉదా—

"అ. అనుజఁజూచికష్ట-మనుజులఁగూడినా।
పనుపుసేయకుండఁ-జనునెనీకు।
ననుచునుదిరిపలుక-వినిహిడింబయుఁగడు।
వెఱచిభీమసేను-మఱువుసొచ్చె॥"

మఱుగునీళ్ళు, రాచిమఱిగె, ఆడమఱుగు, తినమఱగె. మొదలు గునవియును.

౭. కవచః=మైమఱువు. ఉదా—

"క. ఈఱకనరుఁడట్లుమైమఱు।
వఱువుళ్ళగఁజేసిలీల-నంగములెల్లం।

బఱియలుగఁ జేయనాతం।
డఱు మెడలక నేసెమఱియు-నధికరయమునన్॥"

మఱుగుపడె, మఱుపడె ననియుంగలదు.

౮. చర్యా=క్రమ్మఱుట.

౯. పరేద్యుః=మఱునాడు. ఉదా—

" క. మఱునాడయగుట లెస్సగ।
నెఱఁగెనినుండ ఫుడు వేఁడి-యొడలినదీ ప్తుల్।
దుఱగ్గలిగొనిపశ్చిమగిరి।
చఱికినవతిదూరమునవి-శదుఁడైతో చెన్॥"

౧౦. ప్రతిభాషణం=మఱుమాట, మఱుపని.

౧౧. ద్విగ్భంశః=మిఱుమిట్లు. ఉదా—

" సీ. మిఱుమిట్లుగొనిచూడక్కి—పత్రివో పావెలిఁగిప,
రిభ్రాంతి జేసెగి-రీటి కాంతి॥"

౧౨. ఉన్నతోర్వీ=మిట్టు, మిఱుత. ఉదా—

" గీ. వేగవట్టొడ్డియల్లన-వెడలిమిఱుత।
నొకవనస్పతిజొంపమై-యున్న దానిఁ।
జెందిరాతిరియగుటయు-శిలయె సెజ్జ।
గాఁగ సీతార్తుఁడైయుండె-కారవేంద్ర॥"

౧౩. నాతివ్యాప్తం=మిఱిమిఱి. గుంపులుగుంపులనుట. మిక్కి-
లి విస్తారము కాదనుట. ఉదా—

" క. మిఱిమిఱిచీఁకటియప్పుడు।
నతిమిఱిభటులుడుగి కదరి-యనిసేయంగా।
నెఱసితమమెల్లయొడఁగ్రి।
క్కిఱిసినమఱిపాగినిలిచి-రింతనునంతన్॥"

౧౪ వ్రజః=ముఱుప్రోవు. ఉదా—

“క. ఇదుములఁబదయూఁడేడులు।
బడికడుఁగోపించివచ్చె-బలువిడినీక।
వ్వడిదరియనురికివడిని।
ప్పొడయిమ్ముఱుప్రోవులెల్లఁ-బారిగొనఁడెబళే॥”

ముఱికినాటివారు. వలముఱ్ఱియనఁగా శంఖము, ముఱ్ఱుపాలు, ముఱియలు మొదలగునవియును.

౧౫ ప్రకాశః=మెఱయుట. మెఱసె, మెఱుఁగుడుపురువు, మెఱువ. ఉదా—

“గీ. వత్సరంబునకడచను-వ్రతమునాకు।
దానినీయెడజరిపిరయు-త్సాహవృత్తి।
మెఱయనీకుఁగృతజ్ఞత-నెఱపితొల్లి।
యొగ్గుఁజేసినవారిజ-యింపఁబోకు॥”

మెఱుఁగు, మెఱుగారు. ఉదా—

“క. మెఱుగారుసారసంబులఁ।
దఱుచుగనించితిఁగడంగి-తద్గాత్రమునన్...॥”

౧౬ తటిత్=మెఱువు. ఉదా—

“క. ఉఱుముచుమెఱయుచుఁబిడుగులు।
వఱలగనలుగడ్డలఁబడెన-వారితవృష్టుల్।
గుఱుకొనికురియఁగఁబంచెను।
మఱియునునయ్యనల్లుకూడ-మఘువుండలుకన్॥”

౧౭ గాఢం=మెఱక. నూనె మెఱ్ఱుగును గలదు.

౧౮ ఆచ్ఛాదః=కన్నొఱఁగుట, కన్నుమొఱఁగి.

౧౯ మూర్ఖః=మొఱకు, మొఱడు, మొఱలువోయినకత్తి.

౨౦ ఆర్తవాక్=మొఱ, మొఱ్ఱ, మొఱయు, కుక్క-మొఱిగె, మొఱివె.

ఇవిమొదలగునవన్నియును మపూర్వశకటరేఫములు.

శ్లో॥ జలప్రవాహోగోమాయుశ్శోభనంధ్వంసనంద్విధా॥
భయంనిశ్చేష్టితంప్రోచుర్వాగికంజయవాదకః।

౧. టీ॥ జలప్రవాహః=వఱ్ఱు, వఱుత ఉదా—

"మ. నెఱయంబున్నమచందురుంజెనయునీ-నెమ్మోముదాదియ్యనై।
చిఱునవ్వొప్పఁగఁజూడనీకపులకల్-జెల్వొందనిగ్గుచ్చియ।
కక్కఱదీరంబారినకుక్కనంగరముపీ-కంజేర్పనీకెమ్మెయిన్।
వఱుతంద్రోవఁగఁజేసెనేయకటదైవంబెందుఁజొత్తున్సతా॥"

౨. గోమాయుః=వఱడు. ఉదా—

"క. వఱళులుమనచేరువఁబె।
ల్లఱచుటబిట్టెదురుగాలి-యడచుటగ్రద్దల్।
తఱచుగనాడుటవికృతపు।
టఱపులతోఁరేగికాకు-లడరుటఁగంటే॥"

వఱుగు, వఱువట్టు, వఱపు అనియునుంగలదు.

3. శోభనం=వఱలుట. ఉదా—

"క. తఱియగునంతకురిపుఁదన।
యఱకటఁబెట్టుకొనియుండు-నదితఱియగుడుం।
జెఱుచునదిరాతిమీఁదను।
వఱలఁగవృద్ధఘటములెత్తి-వైచినభంగిన్॥"

౪. ద్విధాధ్వంసనం=విఱుచుట. ఉదా—

,, ఆ. ఉలుముఁగొన్న వాఁడవీ-దొలు మేననాఘాత।
బంధనములనొరుల-ప్రస్నదనము।
సెఱిచినాడుపంగు-లఱవలైకాళ్సేయి।
విఱిచి సాగుజనులఁ-బఱపినాడు॥"

౫. భయం=వెఱపు. ఉదా—

,, చ వెఱచితిరాగ దేయనిష్ఠ వేడికదాపగఁదీర్తునీవునా।
వెఱపెటులున్న నీరధిక-వీరులఁదీర్చెదరొల్లనిన్ను నీ
యుఱునెడకేగితో డుపడు-మొడ్డులకెవ్వరికేనినన్న నే,
డ్తెఱునతఁడేగికారవప-తింగనియిట్టులబిట్టువల్కెన॥"

౬. నిశ్ళ్చిష్టితం=నీవ్వెఱ. ఉదా—

,, క. వెఱచఱచివెఱఁగుపడిని।
వ్వెఱఁగందు చుఁగిరుబ్బులంబు-వీరులతనిడ।
గ్గఱినంతనంతఁజూడఁగ।
నుఱకనదీసుతుఁడుదాక-నుద్భటభంగిన॥"

ఇవి పపూర్వశకటములని భారతవేత్తలు చెప్పినారు. ఇవి ప్రాసద్రుష్టములు. ప్రాసద్రుష్టములుగాని శకటములును బుద్ధిమంతులు వీనినిఁగూర్చి గ్రహింపవలయును.

శ్లో॥ అనోభిర్ద్విత్వమనసాఘ్నరేఫైర్నైతరైరపి॥ ౨౩॥
తస్మాద్ద్విత్వయుతాస్సర్వేశకటాఏవనేతరే।

శకటములకు శకటములచేతనే ద్విత్వముగలుగు చున్నది. రేఫలచేతను నితరములైన కకారాదులచేతను ద్విత్వముండదు. అందువలన ద్విత్వములతోఁగూడుకొనినవన్నియును శకటములుగాని రేఫములు కావు.

మిఱ్ఱు, మిఱుత. కొఱ్ఱు, కొఱత. పఱ్ఱు, పఱుత. మొఱ్ఱ, మొఱ. అఱ్ఱు, అఱుత. చిఱ్ఱు, చిఱచిఱ. తొఱ్ఱ, తొఱట. బొఱ్ఱి, బొఱియ. పఱ్ఱె, పఱియ. మొఱ్ఱి, మొఱలు. చుఱ్ఱు, చుఱచుఱ. కఱ్ఱు, కఱుకోల. ముఱ్ఱు, ముఱుగు. కుఱ్ఱ, కుఱువెండ్రుకలు. పఱ్ఱ, పఱకట. ఎఱ్ఱ, ఎఱుపు. గుఱ్ఱు, గుఱక. (గుఱుతు.) చొఱ్ఱ, చొఱుసు. చిఱ్ఱికూర, చిరుతలబొడ్డుతీగె. అఱ్ఱు, అఱుగు జఱ్ఱు, జఱజఱ. పఱ్ఱు, పఱపఱ. బిఱ్ఱు, బిఱబిఱ. గొఱ్ఱు, గొఱగొఱ. గుఱ్ఱు. గుఱగుఱ, కొఱ్ఱు, కొఱకొఱ. జిఱ్ఱు, జిఱజిఱ. పుఱ్ఱె, పుఱియ. గొఱ్ఱె, గొఱియ. కఱ్ఱి, కఱియ. వఱ్ఱె, వఱియ. మఱ్ఱి, ఇఱ్ఱి, జెఱ్ఱి, బఱ్ఱె, జాఱ్ఱ, వెఱ్ఱి, పుఱ్ఱు, ఋఱ్ఱు, పెఱ్ఱ, పఱ్ఱ, కొఱ్ఱలు, తొఱ్ఱుపట్లు. గిఱ్ఱు, గిఱగిఱ. కఱ్ఱు, కఱకఱ. గఱ్ఱు, గఱగఱ. టఱ్ఱు, టఱటఱ. తుఱ్ఱు, తుఱతుఱ. తఱ్ఱు, తఱతఱ. బఱ్ఱు, బఱబఱ. బుఱ్ఱు, బుఱబుఱ. కిఱ్ఱు, కిఱకిఱ. విఱ్ఱవీగి, జఱ్ఱునజాఱి, పఱ్ఱునపాఱి, చిఱ్ఱునచీది, నిఱ్ఱనీలిగి, ఉఱ్ఱింక, కఱ్ఱింక, గుఱ్ఱము, కుఱ్ఱి, కుఱ్ఱ, కఱ్ఱ, బుఱ్ఱి, బుఱ్ఱ, తిఱ్ఱి, తొఱ్ఱి, ఉఱ్ఱూటలు.

శ్లో॥ ఏత్వన్యవర్ణసంయుక్తా స్తే రేఫాః స్స్యురసంశయః॥ ౨౮॥
శకటాస్స్వరసంయుక్తాయేచ తేక రవాచకాః।

టీ॥ ఏవి యన్యవర్ణ సంయుక్తములు గలవో, అవి రేఫములు గాని శకటములుకావు. అవియేవనిన:—

తనర్చు, ఒనర్చు, పొనర్చు, అమర్చు, అలర్చు, ఎలర్చు. ఇత్యాదులు రేఫములు.

శకటములు సంయుక్తములుగా నుండవు. అవియేవనిన:—

అఱచె, అఱిమి, అన్నమఱిగె, క్రిక్కిఱిసె, ఉఱికె, ఉఱిమె, ఎఱిగె, ఎఱగె, ఒఱగె, ఒఱలె, ఒఱసె, కఱచె, కీఱిచె, కొఱలె, కొఱికె. గొఱిగె, చఱచె, చిఱిగె, చెఱచె, జఱిగె, జాఱె, కూరతఱిగె, సముద్రముతఱిచె, ధాన్యముతఱగె, తఱిమె, తెఱచె, దుఃఖముతొఱగె, నఱకె, నుఱపె. నెఱసె, పఱచె, తెప్పిఱిలె, పెఱికె, క్రమ్మఱిలె, ఏమఱిలె, మఱచె, క్రుమ్మఱిలె, నీళ్ళుమఱిగె, రుచిమఱగె, మెఱసె, కన్నొఱఁగె, సుక్కిమొఱిఁగె, వఱలె విఱిచె, వెఱచె. ఇత్యాదులైన కర్మవాచక శబ్దములు అన్యవర్ణయుక్తములు కావుగనుక శకటరేఫములగును.

తలబఱికె. ఇత్యాదులు శకటరేఫములైనను అన్యవర్ణయుక్తములైనయెడల రేఫములు. ఎట్లు:—

పట్టువర్పంగ, కట్టునోర్చుచబట్టు, గుర్తు, అర్వది మొదలైనవి.

శ్లో॥ అడ్వంతాశ్శకటాస్సర్వే ఉమ్వంతోప్వంతకా అపి॥ ౨౫॥

టీ॥ కొఱడు, కఱడు, పెఱడు, బెఱడు, ఒఱడు, వఱడు, మొఱడు. ఇత్యాదులగు నడ్వంతములును అనఁగా అడు అంతమందుఁగల సమస్తశబ్దములును.

నఱుము, నుఱుము, ఊఱుము, అఱుము. ఇత్యాదులైన ఉమ్వంతము(అనఁగా ఉమ్ అంతమందుఁగలవియు)లగుసమస్తశబ్దములును.

మెఱుపు, కఱుపు, చఱుపు, వఱుపు, నొఱుపు, ఒఱుపు, చెఱుపు, పఱుపులేనిబాకి, మఱుప్పు, విఱుపు, వెఱుపు, అఱుపు ఇత్యాదులైన ఉప్వంతము(ఉపు అంతముగలవి)లు గలిగిన కర్మవాచక శబ్దములన్నియును. గుణవాచకమైన ఉప్వంతముగల ఎఱుపు శబ్దము శకటము.

యేదీర్ఘపూర్వాస్స్యుః ప్రాగ్వ్యయదితే హ్రస్వపూర్వకాః।
భవంతిశకటాస్తేతు ప్రాసాద్యైర్బాధితంవినా॥ ౨౬॥

టీ॥ పూర్వమందు దీర్ఘములు గలిగిన పలుమారు, వేమారు, శ్రమంబార, మేకఆర్చె, ఆరుపదులు, అఱుగోరులు, కోరగామి, మోరకులు, కన్నుకీరె, కోరగాక, పళ్ళతోకోరె, పారుతెంచె, క్రోరె, చీరు, జారె, తారె, నూరె, పారె, మారుదినము, మారుమాట, ఓరెక, ఏరె, కోరషము, తోరము, చదువులపంతులబారి, మారి, వారకము. ఇత్యాదులు హ్రస్వపూర్వములయినయెడల ప్రాసమొదలయిన హేతువులచేత నిషేధించఁబడిన ఇమ్మరి, అరసి, గరువతనము, హారిగురించి, శిపునిగురించి. ఇత్యాదిశబ్దములను విడిచిపెట్టి శకటములు అవుమన్నవి. అవి యెవ్వియనిన:— పలుమఱు, వేమఱు, శ్రమంబఱ, మేకయఱచె, ఆఱుపదీ, అఱగోఱలు, కొఱగామి, మొఱకులు, కన్నుకిఱిపె. కొఱగాక, పండ్లతోకొఱికె, పఱతెంచె, కొఱలె, చిఱు, జఱిగె, సముద్రంబుతఱిసె, నుఱిపె, పఱచె, మఱునాడు, మఱుమాట, ఒఱగె, ఎఱగె, కొఱడు, తొఱడు, తొఱము, చదువులబఱి, మఱిడి, వఱకము. ఇవి హ్రిస్వపూర్వములు గనుక శకటములు. హ్రిస్వపూర్వమైనను నన్యవర్ణసంయుక్తమైనయెడల శకటములుకావు. అర్వదిఅనిన రేఫము. ఇదియే ఆద్య శబ్దార్థము. ఉదా—

“చ. ..........................పసనేసిమూడున।
ర్వదియుమనర్ధరాముని-పైసినివంశవరుండుదోడ్పడక॥”

అనియు.

౨. ఉదా—

" గీ. ............................. వెడగు|
పడినయుల్లంబుఁబట్టువ-గ్పంగఁదనకు||"

అనియుంగలదు.

శ్లో|| రేఫో వా శకటో వాపి హ్రస్వపూర్వే ప్రదృశ్యతే|
దీర్ఘపూర్వే తు రేఫస్స్యాన్న భవేత్ శకటక్వచిత్ || ౨౭||

హ్రస్వవర్ణములు పూర్వమందుండఁగా రేఫములున్ను గలవు. శకటములునుగూడఁగలవు. ఎఱుగలి, తిఱుగలి, కఱుగలి, ఆరగలి. ఇత్యాదులు రేఫోదాహరణములు. ఆఱుత, వఱుత, చిఱుత, మిఱుత, కొఱత. ఇత్యాదులు శకటోదాహరణములు. దీర్ఘవర్ణము పూర్వమందుండఁగా రేఫమే కాని శకటముండదు. కారు, గోరు, ఊరు, చూరు, నారు. ఇత్యాదులుదాహరణములు.

శ్లో||అపరస్పరసంబంధాః ప్రాసప్రాసయతిష్వమీ|
తదన్యయతిషు త్వేషాం సంబంధో దృశ్యతే మిథః|| ౨౮||

ఈ శకటరేఫములు ప్రాసములయందును, ప్రాసయతులయందును, పరస్పరసంబంధము లేకుండ నున్నవి. మిగిలినవి యతులయందు ఈశకటరేఫముల కన్యోన్యము సంబంధము చూడఁబడుచున్నది. గీర్వాణపదములలో నుండు రేఫములకు శకటసంబంధము లేదు. ఆంధ్రపదములలో శకటరేఫలకు యతిసంబంధము కలదు. అందుకుదాహరణము:—

" చ. తనమునుబద్ధపన్నములు-దమ్ముని పైఁగలకూర్తిమేర్తిని|
జనపతిసైప లెస్సయని-చక్రనరాజ్యముపాలు లేక తీ|

అమూ, ఏషాం అని బహువచన గ్రహణముచేత శకటరేఫములతో ఋకారమున్ను గ్రహింపఁబడ్డు మున్నది. అనఁగా ఋకారమునకున్ను ప్రాససంబంధము లేదు. యతిసంబంధము శ్లేషమాత్రమున్నది. శకటమునకు లేదు. ఉదా.—

" సీ. ఋక్షాజుంటనివిచారించి పూజించితే,
ర్ణ్యాపాయ్యనుంతుంటె-ధర్మయుక్తి. . . "

అనియున్నది.

శ్లో॥ ప్రథమస్యనశాకట్యందీర్ఘపూర్వస్యనోభవేత్।
లఘుపూర్వద్వితీయస్యతృతీయస్యచవాభవేత్॥ ౨౯॥

పదముయొక్క మొదటి వర్ణమునకు శకటత్వము లేదు. అనఁగా మొదటివర్ణము రేఫరూపమే యగు ననుట. దీర్ఘయుక్తవర్ణము మొదటనుండఁగా రెండవవర్ణమునకును శకటత్వము లెదు అదియును రేఫరూపమే యగును. లఘువర్ణము మొదటనుండఁగా రెండవవర్ణమునకును మూఁడవ వర్ణమునకును శకటత్వముండుటయు, నుండకుండుటయు నుంగలదు. యథాక్రమంబుగా నుదాహరణంబులు—

రేపపండు, రేలచెట్టు— ఇవి ప్రథమరేఫములు.

నారు, పూరి— ఇవి దీర్ఘపూర్వరేఫములు.

పిఱుద, పిఱుసు— ఇవి లఘుపూర్వద్వితీయశకటములు.

క్రచ్చఱ, క్రమ్మఱ— ఇవి లఘుపూర్వ తృతీయశకటములు.

ఉరి, చరి — ఇవి లఘుపూర్వద్వితీయరేఫములు.

చెక్కెర, డెప్పరము— ఇవి లఘుపూర్వతృతీయరేఫములు.

శ్లో॥ ఏకత్రిసప్తమాత్పూర్వమేకత్రిసప్తమాత్పరం।
అచ్చౌరచకంపరంచైవయతిలేసోత్పూర్వమేవవా॥

దేశ్యం గ్రామ్యంచశకటమతద్భవమతత్సమం।
లఘుప్లూర్వంలఘుపరమసంయుక్తమనాదికం॥
శకటేనైవసంయుక్తమృల్కారరహితంభవేత్।
జిహ్వామూలస్థోభ్యతేతశ్చకటంగురుసంజ్ఞితః॥

శ్లో॥ అధరేఫసమామ్నాయః క్రియతే శ్రూయతాంవిభో।
తత్సమాత్తద్భవాత్సంఖ్యాస్సర్వనామానపవచ॥ 30॥
భవంతిహివినారేఫావిశేషవిధిబాధితైః।

టీ॥ తరువాత రేఫపాఠము చేయఁబడుచున్నది. సాంబమూర్తీ! నీచేత వినఁబడునుగాక.

౧. తత్సమములైనవి రేఫములు. ఏవనఁగా:—

రాముఁడు, ధీరుఁడు, శూరుఁడు, ఈశ్వరుఁడు, వసుఁడు, బుద్ధిమంతురాలు, వీరురాలు, కిరిమొత్తె, హరిగాచె, భూసురుఁడు, బిరుదు, ఇత్యాదులు.

వీటియందుఁ గఱకంఠుఁడు అనేశబ్దము విశేష విధిచేత నిశేషింపఁబడినదిగనుక శకటముగాని రేఫముకాదు.

౨. తద్భవములైనవి రేఫములు ఏవనినః—

రాచవారు, రక్కెస, అరుహుఁడు, తురుము, (తురుంబతద్భవము.) అచ్చర, సిరి, తిరము, అద్దిరము, సైరణ, ఈరసము, పరుసతనము, పరికించి, కప్పురము, బమ్మనెల్లి, చందురుఁడు, సెబ్బర, దబ్బర, వరిచేను, మిరియాలు, కొలిమిరి, కాకర, రతనము, కత్తెర, నిదుర, రాతిరి, చతురంగము, గరునము, కొమరుఁడు, తావరము,

బరువు, మరువు, మొక్కరము, బమ్మెర, చక్కెర, మరియాద, అచ్చెరువు, అబ్బురము, రొక్కము, రిత్త, రిక్క, ఇత్యాదులు.

వీటిలో దిక్కఱ, కొక్కెఱ ఇత్యాదులు ప్రాసలయందు నిరూపింపఁబడినవి గనుక వీట్లను విడిచిపెట్టి మిగిలిన సమస్తమైన తద్భవములును రేఫములు.

3. సంఖ్యావాచకములైనవి రేఫములు. ఏవియనిన:—

ఒరుఁడు, ఒక్కరుఁడు, ఒండొరులు, ఇరు, ఇరుబేద, (అనఁగా అన్నవస్త్రములులేనిపేఁదు.) ఈరేడు, ఇరువురు, ఇరువది, ముగ్గురు, నలుగుర్వు, ముప్వురు, నలువురు, ఏగురు, ఏవురు, ఆరుగురు, నూరు, రెండు. ఇత్యాదులు.

వీటియందు ఇద్దఱు, అఱువది, ఇందఱు, అందఱు, ఎందఱు, కొందఱు, ఇవి ప్రాసలయందు నిషేధించఁబడినవి గనుక శకట రేఫములు.

౪. సర్వనామసంజ్ఞలు గలవి రేఫములు. అవి యేవనిన:—

వీరు, మీరు, వారు, ఈరు, ఎవ్వారు, ఏవారు, ఎవ్వరు, తారు, తమరు, వీరలు, మీరలు, వారలు, ఈరలు, ఎవ్వారలు, ఏరికి, ఎవ్వరికి, ఇవి మొదలయినవి.

తూర్పు, పడమర, ఉత్తరము. ఇవి సర్వనామసంజ్ఞకములు గనుక రేఫములు.

అందఱు అనునది ప్రాసనిషిద్ధముగనుక శకటము.

శ్లో॥ సర్వక్రియాన్తా భూమాన్తా వాచకా స్తరువీరుధా॥ 3౧॥

౧. భూతభవిష్యద్వర్తమానక్రియావాచకములు రేఫములు.

ఏవియనిన:— ఇచ్చిరి, తెచ్చిరి, వెళ్ళిరి, తినిరి, కనిరి, వినిరి, పోయిరి, రాగల్గు, పోగలరు, తేగలరు, భుజించుచున్నారు, తేజరిల్లుచున్నారు. దురటిల్లుచున్నారు, ఒప్పుచున్నారు, కప్పరు, నొవ్వరు, ఉండరు, తలరెదరు, అలరెదరు, తూల్లించితిరి, వెలారించితిరి, ఎన్నుదురు, తలంతురు, ఇవిమొదలైనవి.

౨. బహువచనాంతములు రేఫములు.

ఏవియనిన:— నెయ్యురు, బలియురు, మార్తురు, పగతురు, కాల్వురు, పలువురు, బాలురు, వేవురు, పొల్వురు, అహితురు, అల్లురు.

ఉదా—

" క. పురపురఁబోకుఁ-చుబకపతి।
కరకమ్ముదేరఁబనిచి-గారవమున నె।
య్యురుఁదానునగ్గియిచ్చియ।
సురపతియున్నంతవచ్చె-సురపతి నెమ్మిన్॥"

" చ. ..........................వీరులోకపా।
లురయని భీము బార్థునకు-లున్ సహదేవునిఁబంచెఁదూర్పు ను।
త్తరమును బశ్చిమంబు..........................॥"

3. వృక్షలతాదివాచకములు రేఫములు.

ఎవ్వియనిన:— ఉసిరికచెట్టు, రేగు, కాండ్రేగు, రావి, రేల కాకర, బీర, సురపొన్న, బొబ్బరి, కొబ్బరి, సొరకాయ, వదరు విరిదమ్మి, విరజాజి, అరటి, సేరేడు, మారేడు, కానర, బూసర,

పాపర, నక్కెర, గగ్గర, పురుగుడు, వెదురు, ఁగారచెట్టు, పూరి, నారింజ, మొరలిచెట్టు, బూరుగు, పల్లేరు, గన్నేరు, పెన్నేరు, కరక్కాయ, గోరింట, కచూరము, బోడసరము, మిరియము, వరిచేను, పెసర, వరగ, పొదరిల్లు, గరిక, తామర, ఆవురుగడ్డి, ఆరికచేను, వెణుతురు, గజ్జేరు, ఉత్తరేణి, గంటుబారంగి, తోటకూర. నల్లేరు, కురంజివాము, పురుగోరుచెట్టు, గుంటకర, రెల్లుగాడ్డెగడపర, నారికడము, ఇవి వృక్షాదివాచకరేఫములు. ద్విత్వముతోఁగూడుకొనినవి శకటములు. మఱ్ఱి మొదలైనవి.

శ్లో॥ తద్వదర్థేషుచార్యంతే రేఫాస్స్యుర్జాతివాచకాః।

ఆరి యంతముందుఁగల శబ్దములు తద్వదర్థమునందు వర్తింపుచు రేఫములగును. ఎవ్వియనిన:—

పెనుపుగలవాఁడు పెనుపరి. ఉదా—

"క. హరిపలికినవిధమంతయు।
నెరవైయున్నయదివింటె-యీమాటలెఱుం।
గరయుదముతోలుతయీపెను।
పరిచందంబెల్లనెఱుక-పడియెడుఁబిదపన్॥"

పోటుగలవాఁడుపోటరి. ఉదా—

"చ. పరవసమొప్పనీవుగద-పందువుసేయఁదలంచితాకినం।
గురుపతినిర్జితుండగుట-కుంబవనాత్మజయేనుపూటపో।
ంటరితనమెల్లఁజూపుముక-దంగుమునీవనిమేలుమాటమై।
నరవరధర్మసూనుఁడువి-నన్విజయంబొసఁగెన్మఱందికిన్॥"

జూదరి, సూనరి, వెరపరి, నేర్పరి, తీర్పరి, ఉపమరి, నెరవరి, ఒంటరి, మింటరి, తుంటరి, మొక్కరి, మేతరి, లావరి, గద్దరి, కల్లరి, సెబ్బరి, కాపరి, దబ్బరికాడు, తలవరి, చూపరి, పాడరి,

అల్లరి, చిల్లరి, పుల్లరి, టక్కరి, పిక్కరి, కాకరి, గడసరి, దళసరి, పెడసరి, చనవరి, బొంకరి, కింకరి, అతుపరి, జింకదాల్పరి, కలమరి, తలారి, అలరి, (అనఁగా చాటుగలవాఁడు.) తెరువరి, ప్రేలరి, కావరి, జాలరి, గాలరి, కాలరి, పొదుపరి, పాపరిగొట్టు, సుంకరి, సిగరి. ఉదా—

"క. పెక్కం డ్రనొక్కపోరున।
నుక్కరభం జింతుఁ జంపు-దుడుగుడు రాజుం।
దక్కటి చూపరు లెంతయుఁ
వెక్కసపడఁ జిత్రగతుల-విహరింతుఁ దగన్॥"

౪. జాతివాచకములు రేఫలు. అవి యేవనిన—

కంచరి, కుమ్మరి, దొమ్మరి, మేదరి, కమ్మరి, దాసరి, ఉప్పరి, పూజరి మొదలయినవి.

శ్లో॥ ర్వంతానామ్నైకవచనే లఘుపూర్వాఅబాధితాః॥

లఘుపూర్వములైన ఏకవచనమందురు. అంతమందుఁగల శబ్దములు విశేషవిధిప్రాసాదులచేత అబాధితములగుచు సంజ్ఞయందు అనఁగా విశేష్యమందుండిన సాధువర్ణము లనఁగా, రుకారములు రేఫలగుచున్నవి. అవి యెవ్వియనిన—

పెదురు, కదురు, చెదురు, సదురు, అదురు, ముదురు, కుదురు, ముదురుపెదురు, నుదురు, ఎదురు, ఈదురు, బెదురు, బదురు, తుందురు, వందురు, అలందురు, నదురు, కదుదురుగములు, వదరు (అనఁగా సొరకాయ) వగరు, తొగరు, నగరు (అనఁగా నవరు) బంగరు, తగరు, చిగురు, జిగురు, జేగురు (అనఁగా జేవురు) ఇగురుకూర, ఇగురుకొమ్మ, ఎగరు, నిగురు (అనఁగా నివురు) మిణుగురుగములు, పెనరు, కసరు, అసరు, ఒసరు, తుపురు, తుంపురు, చీ

¶ చూపఱుఅని యున్నయెడల శకటరేఫము.

పుసు, చమురు, చమురుకాకి, తుమురు, గుమురుకట్టె, కమురు వాసన, కొమరు, నెత్తురు, తుత్తురు, కూతురు, ఉసురు, ముసురు, కసరు, పసరు, ఎసరు, పిసరు, కొసరు, భట్టరు, జియ్యరు, జాంజురు, తలిరు, అలరు, ఎలరు, పొదరిల్లు, వెలరువారు, గుబురులు, పొగరు, అదరు (అనఁగా జ్వాల) ఒత్తురు (అనఁగా ఒత్తుట) ఇవి మొదలయినవి. చూపఱు, చిఱు, కుఱు ఇవి ప్రాసబాధితములు.

శ్లో॥ రేఫాదయో రేఫపూర్వక్రియాశ్చై ద్వ్యక్షరక్రియాః।

రేఫాదులు రేఫములు. అవి యెవ్వియనిన—

రెల్లు, రిక్క, రచ్చ, రిత్త, రిచ్చ, రెప్ప, రెండు, రోయి, రహి, రెక్క, రేకు, రెండు, రంగు, రేయి. రాయి. రొక్కము, రంకె, రంకు, రాతు, రావుతులు, రొమ్ము, రిమ్మ, రివట, రవిక, రొద్దు, రొడ్డు, రోలు, రోకలి, రెట్ట, రాణువ, రూక, రూపు, రఫతు, రవరవ, రువ్వు, రేచు, రాణి, రాగి, రాట్టము, రొంపి, రాయిడి, రవ్వ, రిట్టు, రొట్టె, రెట్టె, రుబ్బురోలు, రోసు, రద్ది, రేల, రేగు, రావి, రంపి, రంపము, రాపుడు, రేవు, రజ్జులు, రాపిడి, రాపు, రేవు, రొద, రొట్ట, రాణ, రమణ, రప్ప, రెల్ల, రివ్వ, రొయ్య, రక్క, రోజా, రాణివాసము, రోత, రాటిక్రొయ్య, రంగరించుట ఇత్యాదులు.

౨. రేఫపూర్వక్రియలు రేఫములు.

రోల్చె, రొప్పె, రుప్పె, రోసె, రుద్దె, రెబ్బటిల్లె, రెచ్చగొట్టె, రోజె, రోలె, రజ్జె, రాలు, రోయఁడు, రాలె, రవిలి, రుబ్బె, రిమ్మె, రాణించె, రంపిల్లె, రేచె, రేగె, రాసె, ప్రేరేచె, రాజె, రక్క మొదలయినవి.

3. ద్వ్యక్షరక్రియలు రేఫములు. ఎట్లనిన—

కీర నన(గా బ్రాణములను కిరిపెననుట. కొమ్ములజీరె, ఓడిపారె, నీళ్లుతేరె, ఇల్లుచేరె, రిపులతోఁ బోరె, కత్తినూరె, ఊరుగాయఊరె, నక్కతారె, పరులుమీరె, బొక్కకూరె, నిద్రకూరె, పరులఁగేరె, కాలుజారె; అప్పుతీరె, నీచుదూరె, పుట్టదూరె, కాలిఆరె, పళ్ళు యేరె, కాలముమూరె, హితులఁజేరె, ఫలముగోరె, నేయిపేరె, తలదోరె, తల్లిపాలుగిరె. ఇవి రేఫాంతద్వ్యక్షరక్రియారేఫములు.

శ్లో॥ బహ్వాక్షరక్రియా రేఫా అబాధాశ్చేనసంశయః॥ 33॥
అసంయుతోఽపిరో రేఫో లఘుత్ర్యక్షరకర్తసు।
కేష్వంతస్తద్విభాగస్తు రేఫప్రాసేషుదృశ్యతే॥ 34॥

బహ్వాక్షర క్రియలయందైన రవర్ణములు ప్రాసాదిబాధలు లేనివైతే రేఫములు. ఎట్టివనిన—

పరికించె, ఒప్పరికించె, సొమ్మరిల్లె, బమ్మరిల్లె, దిమ్మరిల్లె, ఓరసిల్లె, బోరగిల్లె, దేవిరించె, కావరించె, తేజరిల్లె, ఆరగించె, అలమరె, అలద్దురె, సమకూరె, చేకూరె, బెలుకురె, పరుండె ఇత్యాదులు బహ్వాక్షరక్రియారేఫములు.

క్రమ్మరె, ఏమరె ఇత్యాదులు ప్రాసబాధితములు.
పాదరె, ఓటరె నివియును రేఫములే.
పిగ్గరె, పలవరించె, కలవరించె.

౨. కొన్ని లఘువులైన త్ర్యక్షరక్రియలమధ్యమునందైన రవర్ణము అన్యవర్ణసంయుక్తము కానప్పటికిని రేఫముఅగుచున్నది. ఆరేఫవిభాగము రేఫప్రాసలయందుఁ జూడఁబడుచున్నది.

అది యెట్టిదనిన—

కురిసె, నరసె(అనఁగా కూడుకొన్నదియనుట) బెరసె, వెల్లివిరిసె, అరసె, దొరసె, పొరసె, మెరిసె, మురిసె, ఉరిసె, తిరిసె, పరగె,

అరదము, అరిగె, తిరిగె, సురిగె, చేటచెరిగె, వెండికరగె, పెరిగి, పెలుగుతరిచె, తెరలె, మరలె, ఫారలె, తరలె, దొరలె, ఉరివెననఁగా విడిచె, పరివె, దొరకె, మొరసె, ఉరిలె. ఇత్యాద్యక్షులు.

శ్లో॥ తిర్యగ్వాచీర స్తృతీయోలఘుత్ర్యక్షరక ర్మసు।

తిర్యగ్వాచులైన రవర్ణము రేఫమగుచున్నది. ఎట్లనిన—

తగరు, పూరేడు, గోరింక, ఊసరవెల్లి, కందురీగ, తూరీగ, పురుగు, పురువు, పావురము, చప్పరుకాకి, సవరాలమృగము, తరుపుదూడ, పసరము, గొరవంక, రేచు, బారలమెకము. గొరు, వారువము, గొరకొమ్ము, దునరి (అనఁగా దున్నపోతు) ఇత్యాదులు.

౨. లఘుపూర్వైన త్ర్యక్షరక్రియలయందు మూఁడవవర్ణమైన రివర్ణము రేఫమగుచున్నది. ఎట్లనిన—

అమరె, కమరె, బారిసమరె, నిమిరె, ఒనరె, పొసరె, తనరె, వనరె, అదరె, కొసరె, ముసరె, విసరె, తివిరె, నివిరె, ఇగిరె, ఎగిరె, అదిరె, కదిరె, కుదిరె, చెదిరె, ముదిరె, బెదరె, ఒదరె, తొడరె, తలరె, అలరె, ఎలరె, ఎదిరె. ఇత్యాదులు.

శ్లో॥ లఘుపూర్వపాత్రిసద్భృష్టాః వర్ణగత్యాబ్రవీమితాః॥
రథఃకరోద్భుతంశ స్త్రిసంధానంగమనంప్రియం।
విమర్శస్సంశయార్ధాద్వావర్ధర్చాప్రముఖాఇమే॥౩౬॥

టీ॥ లఘుపూర్వపాత్రిసలయందుఁ జూడఁబడ్డ రేఫలను అకారాద్యక్షరక్రమము చేతఁ జెప్పుచున్నాను.

౧. రథః=అరదము. ఉదా—

౹౹ క. అరదములుదీవులున్నత।
కరులుగిరులుహరులువీచి-కలుసుభటసము।

తక్రూరముగ్రసత్త్వములుగా।
శరనిధిగతిపాండుపుత్ర-సైన్యంబొప్పెన్॥"

౨. కరః=అరి(అనఁగా పన్ను)·అరిగాపులు(అనఁగా బన్నుకాపులు) గోరరి(అనఁగాఁ గొంచెపుపన్ను) అరికట్టి(అనఁగాఁ బన్ను కొఱకు నిర్బంధించి. ఉదా—

॥ క. అరియనివిప్రులచేతను।
ధరణీశులురూకయును మొదలుగాఁగొనరె।
వ్వరునిప్పాపవుమానిసి।
యరిఁగొనియెడుభక్షణార్థియైవిప్రులచేన్॥"

3. అద్భుతం=అరుదు. ఉదా—

॥చ. అరిదితపోవిభూతినమ-శారులబాధలుబొందకుండఁగా।
నురగులనెల్లఁగాచినమ-హోరగసా[illegible]కుఁడానమత్సరా।
సురమకుటాగ్రరత్నరుచి-శోభితపాదునకద్రినందనా।
వరునకుభూషణంబయిన-వాసుకినాకుఁబ్రసన్నుఁడయ్యెడిన్

౪. శస్త్రసంధానం=అమ్మరివోయుట. ఉదా—

॥శా. ఆయుగ్రాహవకేళియందునిపుణుం-డైయొప్పునప్పార్థుఁడా।
గ్నేయాస్త్రంబరివోసిదారుణమహా-గ్నిజ్వాలికల్ భీషణ।
స్ఫాయద్భంగినభస్థలిన్నిగుడద-ర్పస్ఫూర్తిశోభిల్లరా।
ధేయాంగోద్దహనాభిలాషమెడదన్-దీపింపబిట్టేసినన్॥"

॥ క. గొనయముమరినారియొక్కన।
నెనయుమమూర్వికిన్ఁజేర్చు...॥" అని యాంధ్రశేషము.

౫. గమనం=అరుగుట. ఉదా—

"క. నరనుతులరయ్యెదిక్కుల।
కరిగిమహీపతులచేత-నరిఁగొనిధనముల్।
దెరలఁగఁదెచ్చినమార్గము।
బరువడినెఱిఁగింపుమాకుఁ-బరమమునీంద్రా॥"

౬. ప్రియం=అఱ్ఱిలి. ఈశబ్దము లఘుపూర్వము కాకున్నను దీర్ఘపూర్వము కాదుగనుక వ్రాయఁబడెను. ఉదా—

"ఉ. ధర్మసుతుండుపించినను-దానతురంగమశాస్త్రశిక్షలం।
గర్తుజేసియాత్మతుర-గప్రకరంబులకెల్లయుక్తఁగా।
నఱ్ఱిలినిల్పియోఁగియుఁబ్రి-యంబునునాయెడనాడునాటికిం
జేఱ్ఱివహింపుచుండనడ-పెందనతమ్ములలోనివానిఁగన్॥"

౭. విమర్శః=అరయుట. ఉదా—

"క. అరయుదముగానియిమ్మా।
హరునకునుడాపలించి-యరదముపోని।
మ్మురువడినతనికయురికద।
నరుగుదునెబ్భంగినెవ్వ-రడ్డంబైనన్॥"

౮. సంశయే=అరవాయి, అరగలి. ఉదా—

"క. అరవాయిగొనకబెట్టుగఁ।
బరిగొనియక్కడిదిమగల-పైనడరుటయుఁ।
ద్ధురగతినగ్నిజ్వాలల్।
తక్కరములపైఁబడుతయడరు-కరణియకాదే॥"

"చ. నరునకుఁబూనిపల్కితివి-నంజదిమాలినగొడ్డుపల్కులే।
వరగలిలేకబిట్టడరి-నప్పుడుమ్మాడుమునన్నునాతనిం।
దిరమయిబాహుశక్తియును-ధీరతయుఁజెరపుంజలంబునె।
వ్వరిదెసఁగాంచెదెక్కుడుగ-వారిమతింపుముమానుమంతకున్

ఇవి యకారపూర్వ రేఫములు. సంశయార్థా అనఁగా సందేహార్థములు. అర్థార్థమున్ను రేఫమనుట. అరవాయియనఁగా సగముమాట. అరలి యనఁగా సగముమాట. అందుచేత సంశయార్థము లైనవి. అర్థార్థములేవియనఁగా—

అరచందమామ, అరమూత. ఉదా—

“క. నిన్నరసల్పిపోయితి।
యున్న సగము నేఁడుఁదీర్చి-యుడిపెద...॥”

శ్లో॥ ద్వేద్వావింశతిరిష్టంచప్రాంతంచేన్ముఖ్యముచ్యతే।

౧. ద్వే=ఇరు. ఉదా—

నరుఁడును రాధేయుఁడునొం।
డొరువులతోఁబెనఁగుచేట్క-నుల్లంబులలో।
గురువులు వారగఁబొలిచిరి।
యిరుఁదెరఁగుల సైన్యములకు-నేర్తెరమిగులన్॥”

౨. ద్వా=ఇరువురు. ఉదా—

“క. ఇరువురఁదోడ్కొని తానును।
నరిగింద్రసదస్సుఁదనుజ-నాధపురకడకుం।
గరమర్థితోడనందఱు।
బురుకుత్సతనూభవుండు-బూజించెతగన్॥”

3. వింశతిః=ఇరువది. ఉదా—

“క. క్షరమంత్రుఁడు దానివలనను।
క్షరియించినతత్త్వములను-జనవత్సలయ।
య్యిరువదినాల్గింటెఱిఁగిందర।
తరమవిభాగించిచెప్పె-దంచెలియంగాన్॥”

౪. ఇష్టం=ఇరవు. ఉదా—

,, క. తురగంబులపైనాశ్వికు।
లరదంబులమీఁదరథికు-లప్పుడునిద్రం।
బొరసిరికొందఱుభూఁస్థలి।
నిరవుగసుఖనిద్రఁజేసి-రిట్లున్నంతన్॥"

౫. ప్రాంతం=ఇరువు అనఁగా పొరుగు. ఈరెంటియందున్న రేఫలకును కొమ్మున్నది. ఉదా—

,, చ. తిరుగుచుఁబుట్టలంబొదలఁ-ద్రిమ్మరుపాములనెల్లరోసి ని।
ష్ఠురభుజదీర్ఘదండమున-డొల్లఁగ నేయుచువచ్చివచ్చి య।
య్యిరువునదుండుభంబను న-హింగనిరేయఁగ దండమెత్తుడున్।
హరిహరియంచు దుండుభమ-హాహిభయంపడిపల్కె-భార్గవున్॥"

ఇవి ఇకారపూర్వరేఫములు. ప్రియార్థమందు ఇరవు అనుదానికి కొమ్ములేదు.

శ్లో॥ గళబంధనరజ్జుశ్చత్యాగోనేగోమనోవ్యథా॥ 32॥

౧. గళబంధనరజ్జుః=ఉరి. ఉదా—

,, క. ఉరిద్రెవ్వఁగొరికియిప్ప డ।
వెరవారఁగ నీకు నేను-విరుగడ సేయం।
దొరకొనుటనీదుభాగ్యం।
బరితత్వముదొఱఁగిమైత్రి-యలవరపుమదిన్॥"

౨. త్యాగః=ఉరియుట. ఉదా—

,, క. వారిరుహనేత్ర పవన।
ప్రేరితమై లజ్జయురివి-భీతిల్లక్ష్యం।

దారకమూర్తికి రాజ కు।
మారునకిట్లనియెమంద-మందమృదూక్తిన్।।"

3. వేగః=ఉరువడి. ఉదా—

"ఉ. అరదము దేహమింద్రియము-లశ్వములాత్ముఁడు సూతుఁడమ్మహా।
తురగచయంబు ధైర్యమను-తోరపుపగ్గమునన్ దృఢంబుగా।
నురువడిఁ బోకయుండ వెర-వొప్పఁగఁ బట్టినవాఁడు సేమపుం।
దెరవున నేగునప్పరమ-ధీరుఁడు సువ్వెయుదారుఁ డెయ్యెడన్॥

౪. మనోవ్యథా=ఉరియాడుట. ఉదా—

"ఆ. అనుచు సంచలించు-నడియాసఁ గ్రమ్మఱ।
భాసఁదలఁచి ధృతికిఁ-బట్టువెట్టు।
మరుని కోపహటించి-యురియాడుఁదుదిముట్టఁ।
గాన నిశ్చయించుఁ-గలఁగుఁ దేరు॥"

౫. వ్యదా=ఉరియుట, ఉరిసినపుండు. ఉదా—

"క. అని గదచేకొనిన్నృప నీ।
తనయుని మెడిఁ బెట్టియదిమి-తలఁగ్రమ్మఱఁ ద।
న్నినఁగని మునుదన్నుట నె।
మ్మనమరియఁదదగ్రజుండ-మర్షముతోడన్॥"

౬. చ్యుతిః=ఉరులుట. ఉదా—

"మ. ధరణీచక్రము గ్రక్కునంగదల ది-గ్దంతావళిశ్రేణి కం।
ధరముల్మ్రొగ్గఁబడన్ దిశావలయ ము-త్కంపంబుగా నీబలం।
బురులం బారఁగ భీష్ముపై గవియు రౌ-ద్రోద్రేకముం జూచి ఖే।
చరలోకంబును సంచలింపహరిచం-చద్బాహు
ఘోరాకృతిన్॥"

ఇవి యుకారపూర్వ రేఫములు.

శ్లో॥ న్యాసామిషప్రదాహాశ్చ కరీషశ్చ దవానలః।
ఫ్రాస్వైకారముఖాహ్యేతే హ్రస్వాకారముఖాగ్నిపరే

౧. న్యాసః=ఎరవు. ఉదా—

"క. ఇమ్మునరేశ్వర మాతురే।
గమ్ముల నీకార్యమత్యుఁ-గాదే కడులో।
భమ్మున నొడ్డులసామ్ములు।
రమ్మన్న నువచ్చునే యె-రవు సతమగునే॥"

"చ. కరితురగాదిఘట్టనము-గాలియునొంపజె యొంటినున్న య।
త్తరువు ననేకభూరుహ వి-తానమునింపయిపేర్చి బాధలం।
బొరయునె యన్నదమ్ములను-బొందిన నేరికసాధ్యులట్లుఁగా।
కెరవెయినిల్చినరిబరుల-కెల్లిదమై పరివోదురెంతయుఁ॥"

౨. ఆమిషం=ఎర. అనఁగా గావు. ఉదా—

"క. నరపతులనెల్లభీష్మున।
కెరగానొప్పింపఁజాల-నేనడవుల్లకుఁ।
మరలఁగఁబోయెద నచటనె।
తిర్రిగదఁ గూరాకుఁగోసి-తినియెద ననఘా॥"

3. ప్రదాహః=ఎరియుట, ఎరిసె, ఎరిసిరి. ఉదా—

"క. పరులధనమునకు విద్యా।
పరిణతికిం దేజమునకు-బలమునకు మనం।
బెరియగ నసహ్యపడు న।
న్నరుఁడు దేవులులేని వేద-నంబడు నధిపా॥"

౪. కరీషః=ఎరివి, మేకయెరివి.

౫. దవానలః=ఎరగలిచిచ్చు. ఉదా—

"చ. ఎరగలిచిచ్చు కారడవి-యెల్లను బెల్లుగ నొక్క-పాయగా।
దరికొని రూపడంచిన వి-ధంబున నిక్క-డ సేనయంతయు౯।
దరిమిడిచం పెభీష్ముబల-దర్పమహోగ్రత( గంటెయింక నే।
బిరుదొకొ నీలమేఘమన(-బేర్చియనిం దగటూర్చునాతని౯॥"

ఇవి హ్రస్వైకారపూర్వములగు రేఫములు.

శ్లో॥ అన్యోన్యోన్యమతాన్యోన్యేపరతస్తుకపూర్వకాః।

౧. అన్యః=ఒరుడు. ఉదా—

" ఆ. ఇన్నరేంద్రుచేత-మున్ను గృహీతమై।
యున్ననాకరంబు(-గ్రన్ననింక।
నొరులకర్హ మగునె-పరిణయవిషయమై।
యొరు(బరిగ్రహింప(-బరమమూర్తి॥"

౨. అన్యోన్యం=ఒండొరు.

౩. అన్యోన్యే=ఒండొరులు.

ఇవి హ్రస్వోకారపూర్వములగు రేఫములు.

శ్లో॥ మూషాద్రుతంభృశంవాయుస్సామ్యంవృష్టిస్తథైవచ॥

౧. మూషాద్రుతం=మూసనుకరిగి గట్టిగాబోసిన వెండి బంగారు మొదలయిన నీరుకరువని లోకవ్యవహారము. ఉదా—

"చ. కరువున(బోసిరో విధుని-కాంతిసుధాబ్ధితరంగ దెచ్చి గం।
డరువొనరించిరో హరుజ-టాస్థలికగ్గ దొడవైనయేటిపె।
న్నురువున(జేసి రోయన మ-నోజ్ఞసితచ్ఛవి నుల్లసిల్లు సుం।
దరతురగోత్తమంబు దవు-దవ్వుల(గాంచిరి చారులోచనల్॥"

"తరంగ" అనేదిస్థాన "లుగ్భవేతుస్థాశాదేర్గోః" అను సూత్రమువల్లను మువర్ణలోపముగలిగెను.

కండరువొనరించిరో=తునిగిమలిచి మెరుఁగువెట్టిరో. కండింపుగా మలిచి మెరుగుతో మిరో యనుట ఉదా—

" గీ. మిగిలిబ్రహ్మాండభాండంబుఁ-బగులవ్రేయ।
నప్పళింపు మఁబ్రళయకా-లానలమునఁ।
గండలించినరూపంబు-కరిణి భీముఁ।
డతిభయంకరాకారత-నతిశయిల్లె॥"

అని విరాటపర్వమునందున్నది. కండలించెననఁగా కండించెననుట. ఇవి మూఁడున్ను హేతూత్ప్రేక్షలు. కరుగుట యనియుఁ గలదు. ఉదా—

" గీ కుసుమబాణుబాణంబులుఁ-గూడ నైదుఁ।
గరఁగ్గి నేరిమి వాట్టించి-కరువుఁగట్టి।
పోపి చేసి చైతన్య సం-పుటముఁదగ ఘ।
టించిరో కాకయిట్టిచే-డియలుఁగలరె॥"

౨. భృశం=కరము. ఉదా—

" క. జరయనురాక్షసినీశుం।
గరమపకారంబుఁ జేసె-ఘనముగ దానిం।
ధరణీశ యే నెఱింగితి।
నిరుపమనిరతిశయ యోగ-నిష్ఠితబుద్ధిః॥"

౩. వాయుః=కరువలి. ఉదా—

" క. గిరిడిగు కేసరిచాడ్పున।
నరదముఁడిగి భ్రమితపటుగ-దాభీలత నా।
కరువలిసుతుండుగవిసినఁ।
గరులు దెరలెఁ బవనధూత-ఘనపఙ్క్తిగతిః॥"

3. సామ్యం=కరణి. ఉదా—

,,ఆ. అరణినగ్నివోడము-కరణిదేవకియందు।
విప్రయజ్ఞకర్త-వేదగుప్తి।
కైజనించెనెవ్వఁ-డవ్వసుదేవనం।
దనుభజింతునేక-తానిరూఢి॥''

౪. వృష్టిః=కురియుట. ఉదా—

,, సురపతిసభఁజూడం-బూడ నంగారవృష్టుల్।
గురిసె గులిశధారల్-గుంఠితంబొందెదిక్కుం।
జరమనములడంగెన్-సర్వదిక్పాలకాంతః
కరణములుభయోద్వే-గంబునన్సంభ్రమించెన్॥''

ఇవి కకారపూర్వరేఫములు. కురువు అనఁగా తోడ. కురులు, ఘురుగలి, కురగట, కురంగట. కుగువు 'అనియునుంగలదు. కురం జవాము. ఉదా—

,,సీ. ఇందుబింబముమీఁది-కందుచందంబునఁ,
గురులు నెమ్మొగమున-నెరసియుండ...''

అని.

శ్లో॥ మర్యాదాగౌరవంసైన్యమమృదుత్వంగళంతికా।
మహాతిశయణత్యేతే స్మృతా రేఫాఃగపూర్వకాః॥౪౦॥

౧. మర్యాదా=గరుసు. ఉదా—

,,క. గురునకు నాకును బాండవు।
లరయఁగఁగూరిమికిఁ బాత్ర-మగుదురయైనం।
దురమునఁజుట్టరికంబను।
గరుసిడుకొనుటేలఁగలుగుఁ-గౌరవనాథా॥''

"సీ. గరుసులుగీడువంగఁ-గదలియల్లల్లన
నొత్తుచు నెడముల-నోత్తరించి..."

౨. గౌరవం=గరువతనము. ఇదియే గారవము: గరువులనిపించుకొనుచున్నది. గరగర, గరగరిక యనియుంగలదు. ఉదా—

"గీ. ధీరయై యిట్లు సమ్మద-స్ఫారమునకు।
గరువతనమును బలితంపు-గద్దె వెట్టి।
వెలఁది యెులుఁగనియది వో్లె-వింత లేక।
యల్ల నెప్పటియట్టుల-నరుగుటయును॥"

"క. చరువులునమ్ముని చెప్పిన।
తరువులు వీడ్వడి రెుసుతకుఁ-దల్లికినట్లు।
య్యిరువురు నుప్పయోగింపఁగ।
గరువులుదత్త్ర్పకార-కలితములయ్యెన్॥"

"గీ. ఏనువంటలవాఁడనై-యానరేంద్రుఁ।
గొలిచి గరగరగాఁగూడుఁ-గూర చిత్త।
మునకువచ్చినయాచంద-మునవొనర్చి।
నేర్చి మెలఁగుదుఁ గరము వి-నీతి మెరసి॥"

"సీ. పరువులై చెలువంపు-గరగరికయుఁ దియ్య,
తెలినీరుఁ గలిగిన-దీర్ఘికలును...॥"

గరిత యనియునుం గలదు.

3. సైన్యం=మొగ్గరము. ఉదా—

"ఆ. మెఱుఁగు మెఱసినట్లు-మెఱయంగ నరదంబు।
కర్ణికారకేతు-కాంతి వెలుఁగ।
నంపగములగురుని-నలియించి కడచి యిం।
ద్రజునిఁ గొడుకు మొగ్గ-రంబు సొచ్చె॥"

౪. అమృదుత్వం=గరుపు. ఉదా—

"క. నరపతియానందాశ్రులు
గరసరసీరుహంబునొత్తి-కనుదనియఁగ న
య్యిరువురఁజూచుచు మేనులఁ
గరుపారఁగఁగ్రుచ్చి యొక్క-కౌఁగిటఁజేర్చెన్॥"

౫. గళంతికా=గరగ. అనఁగా బుడ్డిచెంబు. "కర్కర్యాళూ ర్గళంతికా." అని యమరము. ఉదా—

"గీ. గరగలొసఁగినరుండుభూ-సురులొనర్చు
నాచమనముఖకర్మంబు-లందుపట్టు
భాగఫలమందునెగడికి-బాచనమున
కింధనములిచ్చిధనమున-నెసఁగమెసఁగు॥"

౬. మహాతిశయః=గురువు. అనఁగా మిక్కిలిగొప్ప. ఉదా—

"క. గురునుపదేశమునడపుం
బురహరవిజ్ఞాత్రవేగ-మున నాఁకలితోఁ
బొరయండభ్యసనమునను
గురువుగ నాహారమెపుడు-గొనఁడేచవులన్॥"

"క. నరుఁడును రాధేయుఁడు నొం
డొరువులతోఁ బెనఁగు వేడ్క-లుల్లంబులలోఁ
గురువులు వారఁగఁబొలిచిరి
యిరుదెరఁగులసైన్యములకు-సేర్తైఅమిగులన్॥"

"క. గర్వించిపలికితగు నీ
గర్వము భుజవీర్యమును బ్ర-కాశంబుగ ని
ప్పర్వతశిఖరముఁదెచ్చి వి
గుర్వింపుముచూతమనిన-గోత్రభిదుండున్॥"

గోరకొమ్ము, గోరవంకపిట్ట, తగరు, తోఁగరు, తెగరము మొదలైనవి గకారపూర్వరేఫములు.

శ్లో॥ శైఘ్ర్యమద్భుతమాచ్ఛిత్తిఃప్రవేశశ్చచపూర్వకాః।

౧. శైఘ్ర్యం=చెచ్చెర. ఉదా—

"ఉ. కురుపతిరాజసూయమున-కుంధనమిచ్చిరి రాజులెల్లనా।
దరమునఁ బ్రీతిసేయునది-తానుసుఁదప్పకయుంచు లంకకు।
చ్చెరువుగఁ బుచ్చెదూతలఁ బ్రి-సిద్ధిగనంత విభీషణుండుఁ జె।
చ్చెరపహదేవుశాసనముఁ-జేకొనిచేసెఁగరంబు నెమ్మితోన్॥"

౨. అద్భుతం=అచ్చెరువు. దీనికి పైపద్యములోనే యుదాహరణమున్నది.

3. అచ్ఛిత్తిః=చెరుపుట. అనఁగా తూలించుట. ఉదా—

"చ. కరమునఁ దోత్తుకూలమునఁ-గ్రమ్మ మెరుంగులు శత్రుసైన్యభీ।
కరములుగా గజాశ్వభట-కాయములం గుదిఁగ్రుచ్చినట్లుగాఁ।
జెరుపుచువచ్చువాని గురు-సింహుఁడుఁ జూచి మదాంధ
సింధురో।
త్కరశరభాతిభీషణము-గాఁగలిసెన్ బటువిక్రమోద్ధతిన్।"

చేటతో చెరుఁగుటయునుఁగలదు.

"క. ధరణీసురవరులకుఁగడుఁ।
బెరఁగైనెడదయొరిఁగియుదయ-సేయుదుర మహా।
పురుషులని నరుఁడువిలుఁగోవి।
యురిగనుఁబ్రముచ్చులపిరుంద-నవ్విప్రునితోన్॥"

చెరిసగము, చెరవము అనఁగా బాన.

౪. ప్రవేశః=చొరుట. ఉదా—

"క. కురువంశముఁ బ్రుంచుటకుం।
జొరఁజాలకనామనంబు-సుడివడిరయుదు నే।

వెరవునుదొరకొనేదుగదే।
సరసీరుహనాభపొందు-సంపాదింపన్॥"

ఎండుపొరుగు, పెట్టిచొరుగు, చొరయనఁగా రాజీవమను పెద్ద చేపఅనియుఁగలదు.

పూజరి. ఇత్యాదులు జపూర్వ రేఫములు.

పోటరి. ఇత్యాదులు టపూర్వ రేఫములు.

శ్లో॥ అభిక్రిమార్గాద్యానాశోడపూర్వాడమరుప్రియ॥౪౧॥

౧. అభిక్రమః=అడరుట, తొడరుట. ఉదా—

"చ. పవనజుచాపముల్ హరుల-పగ్గములుందునుమాడికాడితో।
నవిపెనఁగాడఁగా వెదద-యప్పున కేతువుఁగూల్చి నూతు మే।
నవియఁగఁజేసినంబరచె-నాతఁడుఫల్గునుచక్రిరత్తు తే।
రి వెమక కుక్క శక్తియడ-రించె జలింపక భీముఁడ త్తరిన్॥"

౨. నాశః=పొడరుట.

కరడరువు, కరడారించుట, అనఁగా కండించుట. ఉదా—

"చ. కరువునబోసిరోవిధుని-కాంతిసుధాబ్ధితరంగఁదెచ్చి కం।
డరువొనరించిరో॥" అనియున్నది.

శ్లో॥ క్రమక్రమఃక్రమశ్చైవపూరుషాంతరమేవచ।
మథసంభిత్తుతాచర్యాత్ర్యతంద్వేష్యాఃపలాయనం॥—
ప్రతిసీరాదంశభేదామార్గోవై మార్గచారికా।
అకర్తకప్రయోగేతుప్రపాతశ్చతపూర్వకాః॥ ౪౩॥

౧. క్రమక్రమః=తరతరము. ఉదా—

"క. తరతరమపరిజలదున్నిమిదు।
నరునప్పటియెత్తికోలు-నరుసురవిద్యా।

ధరఁ ఖేచరులతిభీతిం।
బోరనిరితము దెసకు నేఁగి-పుట్టునొ యనుచున్॥"

౨. క్రమః=తరము. ఉదా—

"సీ. తరమిడి యొగ్గసము-త్కరము ఘోరంబుగా,
పఱియించుకొంటిర-వంబు నేఁడు।

3. పూరుషాంతరం=తరము. తరమనఁగా నొక్క-పురుషుని జీవనకాలము. ఉదా—

"క. నిరతంబు బ్రహ్మ మొదలుగ।
వరుసన రొండ తెగక నిట్లు-వచ్చిన వంశం।
బురుభుజనీ వుండఁగనీ।
తరము నవిచ్ఛిన్న మనుట-ధర్మువె యనినన్॥"

తరువాయి, తరువాత, తరకసము, (అనఁగా అమ్ములపొది.) తరుపు పెయ్య, చిత్తరువు, ఎత్తరువు, ఒత్తరించె అనియును గలవు.

౪. మథనం=పెలుఁగుతరచుట. ఉదా—

"గీ. మెఱచి మందలచారియై-కొఱవిఁ ద్రిప్పి।
నట్లు గురుకృపసింధురా-జాదులైన।
యోధవీరులు బెగడొంద-నులివు మిగిలి।
తరువఁబడినట్టి కిర్యసేనఁ-దిరుగఁబడఁగ॥"

తరిగొండ యనియును గలదు.

౫. భిక్షుతా=తిరిపెము, తిరిసె, తిరిసిరి. ఉదా—

"చ. దురమునఁ దెంపుఁ జేసియును-దోర్దమలీల వెలుంగుచుండ సు।
స్థిరతశమంతపంచక వి-శిష్టతలంబునఁ బోరసద్గతిం।
బోరసెదు నీకు నైవగపు-పుట్టదు బంధులు రాజు దేవులుం।
దిరియుదురింక వారికగు-దీనతకోర్వక యుమ్మలించెదన్॥"

ప్పరమున జూచి హ్వాదయ్యమగు-పాన్పున బాదట బ్రవోత్తుసన్।
గ్గురుపథకారిఁ గాంచి మదిఁ-గ్రొత్తగఁ గ్రొవ్విదము సందడింపఁ గన్।
స్థిరతఁ బదప్రహారమునఁ-దెల్పెఁ ద్రిశీకర జాభిరాముఁడై॥"

౧౧. దంశభేదాః=తెరయాగలు. ఉదా—

"క. తెరయాగల్గ లిగ విర్యుచు।
జారిజారి దుదురులపగిది-బారుఫుచు వెరకై।
వెరపున గాకులు గ్రొతులు।
బరువడి జీకాకుపరచుం భంగినలచుచున్॥"

౧౨. మార్గః=తెరువు. ఉదా—

"చ. అరదము దేహమింద్రియము-లశ్వములాత్మఁ డునూతుఁ డమ్మహా।
తుర్గిచయంబు ధైర్యమును-తోరపుపగ్గమునందృఢంబుగా।
మఱువడిఁ బోకయుండ వెర-వొప్పఁగఁ బట్టినవాఁడు సేమమ్రుం।
దెరువున నేగునప్పరమ-ధీరుఁడు సువ్వెరయుఁ దారుఁ డెయ్యెడన్॥

౧౩. మార్గచారిణా=తెరవాటు. ఉదా—

"క. తెరవాటువ్రముచ్చుమి ను।
ధ్దుగులగుక్రూరులగుమూకఁ-దోరంబగు న।
వ్వైరిహరిదోరలబలంబుగ।
ధరణీశుడుఁ గూర్చుకొనుట-దైవ్యముఁ దెచ్చున్॥"

౧౪. ప్రపాతః=తోరగుట. ఈశబ్దము అకర్మక ప్రయోగము నందు పాతార్థమైనయెడ రేఫము. ఉదా—

"మ. విరథుండై యుధిరాముకూలమున న-వ్వీరుండు నా సేయుచున్।
చెరయంబారనతండు భల్లములఁ ద్రుం-చెం బెక్కు ఖండంబులై।
తొరుగం జూచి విస్మితుండయి నిజరథ-స్థుం జేసి తద్బాణిగ్।
వరశా దుర్దశతావ్యథోద్యముఁ గృపా-చార్యుండు
తెప్పించినన్॥"

ద్రవ్యవాచకమైన తొడవను రేఫము. కత్తెరదొంగలు.

“క. కలవుపయిఁ గలవు బారయుఁబు।
నెలవుపయి న్వెలవుఁ దోప-విడువనియిడుమం॥
దొంగమి వ్రుసఫూండెడుమం।
దొంగమిఁ జేడ్పడుచునడఁచు-దుష్కర్మములన్॥”

ఈపద్యములో దొంగమి యనునది త్యాగార్థకమును సకర్మకము గనుక శకటరేఫము. సాత్వార్థణిజర్థకమైనయెడల రేఫమవు చున్నది ఉదా—

“క. గురుద్రుపదసేనుఁడుఁ దాకిన।
హరిసారథి కేతు రథశ-రాసనశక్తులన్।
తక్కరములతో ధ్వనతండును।
దొరగించెదదీయతనువు-తునియలుధరణిన్॥”

శ్లో॥ చరమంసమరంముఃఖమగ్నించై వాలవాంకం।
ప్రభుగ్రప్రాప్తిశ్చసామ్యంచదపూర్వాన్విద్ధిశంకర॥

౧. చరము౦=దరి, చివర. ఉదా—

“క. కురున్నప విను సంసారము।
దరిఁద్రొక్కనవార మింకఁ-దలకెదమే సం
గరమునకు నేము నీకై।
పొరలితిమిట్లైననవుడ-పొందెదమనుచున్॥”

“క. దరిఁగానిదహనుఁడుఁ గాన్పు।
వసుసమ సహదేవు సకల-వాహినిమధ్య।
శక్రులపయిఁ దురగములై।
వరరథములపైఁ బదాతి-వర్గంబులపైన్॥”

౨. సమరం=దురము. ఉదా—

"క. దురమునజయముఁగొనుటకై।
నరపతులకువలయు హింసనం బెట్టులు ద।
త్పరిహారణస్థానములును।
ధరణీశ్వర కలవు తెల్పు-దగ విను వానిన్॥"

చిదుర, చిదురుప అనియునుంగలదు.

3. దుఃఖం=దురటిల్లుట. ఉదా—

"క. పరిభవకరుఁడగుకీచకుఁ।
బరిమార్చుటకిపుడుగడువఁ-బడియెనె యిట్లే।
దురటిల్లనేల ద్రౌపది।
భారిగొననీమనము కలకఁ-బుత్తు లతాంగీ॥"

౪. అగ్రం=ఎదురు. ఉదా—

"క. మగటిమివారికేవీడెదు।
రుగనమ్మి సుయోధనుఁడు వి-రోధముఁగొని స।
ర్వగుణాఢ్యులు బలవంతులు।
నగు పాండునృపాలసుతుల-నవమానించెన్॥"

౫. ఆలవాలం=కుదురు. ఉదా—

"క. కరి తురఁగ రథసమితి బాం।
పిడవోయెడు సాదులక్ష్మి-పెంపునకెల్లన్।
సరసీరుహనయనవీవు కుఁ।
దురుగా వొనరించెదం గు-తూహలమెసఁగన్॥"

కుదురు, బెదురు, సదురిత్యాదిశబ్దములును గలవు.

౬. ప్రభుః=దొర. ఉదా—

౹౹క. కురుపాండవసైన్యంబుల
దొరలఢీయాలములరొప్ప-తో మెరయ సము
ద్ధురవీరధ్వజములఁ బొలి
విరి శౌర్యస్ఫూర్తిమూర్తి-చేకొన్న క్రియన్॥"

౭. ప్రాప్తః=దొరకొలు, దొరకొనుట, దొరకుట. ఉదా—

౹౹క. శరనిధి ఫేనంబునవా
హరిపొంది జగద్విరోధి-యగు వృత్రుని దా
బరిమార్చ నీకువిజయము
దొరకొనియెంగానదీన-దోనముగలదే॥"

౮, సామ్యం=దొరయుట, దొరసప్తార్చికి, దొరసి. ఉదా—

౹౹చ. సరియగునాకు దివ్యశర-జాలములందలపోసిచూడ వ
న్నరుఁడుదృఢత్వలాఘవగు-ణంబులఁ దక్క-దూరపాతన
స్ఫురణఁ గరంబుపట్టపడు-భూవరసాత్త్వవశేఖ సేమియుం
దొరయఁడు ధైర్యశౌర్యపటు-దోర్వ్యథనంబులహీనుఁ
డెంతయున్॥"

౹౹మ. దొరసప్తార్చికిలావునంబవమతోఁ-దుల్యుండు శల్యుండు...॥
ఇవి దపూర్వరేఫములు.

శ్లో॥ పలితానిక్రియాస్నాయుగ్ఘేనోయోగేనపూర్వకాః॥

౧. పలితాని=నరలు=అనఁగా నెరిసినవెంట్రుకలు. ఉదా—

౹౹క. నరలుగలకొమ్ముసైనం
దరుణులురోయుదురు డాయ-ధనపతియైనం
బురుషుఁడుదుర్వారజరా
పరిభూతినభీష్టభోగ-భాగ్యుఁడ కాఁడే॥"

"ద్వి. తనరియేర్పడునరల్ - దద్దయుమదిమీ
దలవణంకుచునుండు - ధనపిత్రువరుల॥

౨. క్రియా = ఒనరించుట. ఉదా—

"క. వినుసౌభాగ్యసమేతుఁడు
మునునిజదారైకపరుఁడు - ముందటిజన్మం
బునభార్యకుఁ బ్రీతియొన
ర్పనిమనుజుఁడు భగల్గావి - రహితుండెందున్॥"

3. స్నాయుః = నరము. ఉదా—

"క. ఇరువ్వురయందునఁజూడఁగ
వెరవెడలినయాగ్రహమున - ప్రేసినగడలాం
డ్రౌరుల మెడలకెలకులబ
ల్లరములు దాకుటయు వారి - లంబడిరధిపా॥"

౪. ఫేనః = నురువు. ఉదా—

"క. నురువున నొనరించినపం
జరములలో నున్న పులుగు - చాట్పున మేనం
బురుషవరజీవము లొడుటఁ
బరికింపఁగ నేమరంగ - బాడియెనీకున్॥"

౫. యోగః = నెరయుట. ఈశబ్దము యోగార్థమైనయెడల శేఫము. ప్రకాశార్థమైన శకటము యోగార్థమందు. ఉదా—

"క. తరళనయనాబ్జపళ్ళముల
నెరయఁగ బైమున్న జల్లి - నృపసుతుఁబ్రాజిం
చిరతమ సుమచయాలు
కరణవిశేషముల జేసి - కాంతలు ప్రీతిన్॥"

ప్రకాశార్థమందు: ఉదా—

" మ. నెఱయంబున్న సుచందురుం జేసయుని - నెమ్మోము దాడియ్యనై।
చిఱునవ్వొప్పఁగ...॥" అని.

కిస్నేర పస్నేరము పస్నేరమనియుంగలదు:—

శ్లో॥ పరిపాటిశ్చవిపులంవిషమంచప్రవర్తనం।
పరిపాకఃపరీక్షాచదండయాత్రాచమారణం॥ ౪౬॥

శ్లో॥ విరళంపరితశ్చైవతథావృత్తిశ్చసాహసం।
ఆధోరణాశ్చశయనంశిబిరంవ్యూమచక్రమః॥ ౪౭॥

శ్లో॥ రజ్వేకభాగజౌత్కట్యమనుకార్యోప్యభిక్రమః।
సామ్యంచబూతాశౌచంవర్ధనంప్రాప్తిరేవచ॥ ౪౮

శ్లో॥ పునఃపునర్జీవితంచప్రాప్తంచపరివర్తనం।
పలాండ్వాదిత్వర్చరేఫాఃపపూర్వాః పరమేశ్వర॥౪౯॥

౧. పరిపాటిః=పరువడి. ఉదా—

" క. నరనుతులయ్యెదిక్కుల।
కరిగిమహీపతులచేత-నరిగొనిధనముల్।
దెరలగదెచ్చినమార్గము।
బరువడినెరిగింపుమాకు-పరమమునీంద్రా॥"

౨. విపులం=పరపు. ఉదా—

" క. పరమేశుడుతనయూరులు।
పరుపుగనొనరించిదాని-పైదచ్చురముల్।
పరుషతరసితసుదర్శన।
ఖరధారానిహతిజేసిఁగక్కనదునిమెఁ॥"

౩. విషమం=డెప్పరము. ఉదా—

,,చ. పరమపతివ్రతంగడుదపస్వినిపాండవధర్మపత్నిధ|
ర్మరతనయోనిజంబ్రకృతి-మానవభామినిగాదటంచి డె|
ప్పరములు వల్కఁ గాదగునె- బాల్యముపక్కఁ వుదుష్టవాసనం|
బెఱిగితినీనిమిత్తమున-బెద్దయుదుఃఖితులైరిపాండవుల్॥"

౪. ప్రవర్తనం=పఱగుట ఉదా—

క. పరమతపోనిధియాయా|
పరవంశోత్తముఁడునియమ-వంతుఁడులోకో|
త్తరుఁడుజరత్కారుఁడునా|
బఱగినముని బ్రహ్మచర్య-పరిపాలకుఁడై॥"

పఱగనఁగాకర్త్రర్థకము. పఱగించెననఁగాణిజర్థకము. ,,వెఱ
వులేక భంగపఱచివారెయనునది శకటము.

౫. పరిపాకః=పఱువము. ఉదా—

,,సీ. పఱువంబుదప్పిన-విఱులు రాలుచుదఱు,
చయము జొక్కులు లేని-చదలజనయు|

౬. పరీక్షా=పఱికించుట. ఉదా—

,,క. పఱికింపఁగ భాహ్యాభ్యం|
తరజనములవలనసంత-తమునిజరక్షా|
పఱుడవయిపరమహీశుల|
చరితమువీక్షింతెనిపుణ-చరనేత్రములన్॥"

౭. దండయాత్రా=పఱిసనుడెంచుట. ఉదా—

,,చ. పఱిసనుడెంచిగోగణము-బట్టిరనన్వినిపిన్నగానమి|
పరయక రాజనందనుఁడు-హాంకృతిమైబరతెంచిసైన్యవి|
స్ఫురణముసూచిభీతిదన-బుద్ధిగలంగినబారజొచ్చెని|

ప్పురుషుని శౌర్యసంపదయు-భూరిబలంబు
నెఱుంగఁ డేమియుఁన్॥'

౮. మారణం=పరిమార్చుట. ఉదా—

॥క. శరనిధిఫేనంబునసా।
హరివందిజగద్విరోధి-యగువృత్రునిదా।
బరిమార్ప నీకుపాయము।
దొరకొనియెంగాకదీన-దోసముగలదే॥ ''

౯. విరళం=పరిమొయిలు. ఉదా—

॥సీ. పరిమొయిల్గప్పిన-పాడరినునుకాంతి,
గదిసినయమృతాంశు-కళయువోలె।''

౧౦. పరితః=పరిచుట్టు. ఉదా—

॥సీ. కమలాస్య ముద్దుమొ-గంబులే మెఱుగుల,
మొత్తంబుపరచుట్టు-ముట్టికొనఁగ। ''

౧౧. ఆవృత్తిః=ఒకపరి. ఉదా—

॥క. నకులునిదాకివికర్ణుం।
డొకపరియైనను బెనంగ-నోపకతరిగెన్।
సకలబలముజూడఁగ రా।
తికిబైకొనియడరితగరు-తిరిగివభంగిన్॥ ''

౧౨. సాహసం=పరిగొనుట. ఉదా—

॥క. అరవాయిగొనక బెట్టుఁగ।
బరిగొనియక్కడిదిమగల-పైపడరుటయు।
ధ్వరగతినగ్ని జ్వాలల్,
తెక్కెరములపైమిడుతయడరు-కరణియగాదే॥

౧౩ అధోరణః=పరికాఁడు, పరిగోలఁబట్టువాఁడు. పరిగోల యనఁగా నంకుశము. ఉదా—

‖చ అనిలజవంబునంబరచు-నమ్మదనాగముఁ ద్రిప్పి త్రిమ్మరిం।
చిన పరికాఁడపోలె గుఱు-సింహ పరాక్రముఁ డిట్లుఁ గ్రమ్మరిం।
చు నె యితఁడంచు నుందగిలి-చూపరు సాల్వమహీశు విక్రమం।
బొనరఁగ నల్గసం బొగడు-చుండిరి విస్మయసక్తచిత్తులై॥"

౧౪ శయనం=పరుండుట.

ఇత్యాద్యర్థములు పరిశబ్దమున కెన్నియున్నను దారితార్థమందు తప్ప శకటములు కావు.

౧౫ శిబిరం=చప్పరము. ఉదా—

‖చ. తెరయును మేలుకట్టు నగు-దీపములుం జెలువొందునట్టి చ
ప్పరమున జారు హృద్యమగు-పాన్పున...॥"

౧౬ వ్యోమ=ఉప్పరిగ, వీధి. ఉప్పరిగె అనఁగా గృహము, పరిగెలు అనఁగా చేపలు.

౧౭ క్రూరః=పరుసు. ఉదా—

‖క. గురుభీష్మాదుల మనములు।
దురమునకుం జొరకయుండు-దుర్యోధనుఁ డా।
తురుఁడై యొడబఱుపఁగ ని।
ప్పరుసున నెరవైన రిచ్చ-పడు బలమెల్లన్॥"

౧౮ రజ్వేకభాగః=పిరిగొనుట. ఉదా—

‖గీ. ఇవ్విధంబునఁ బల్కిన-యింతిపలుకుఁ।
గాన నేరక తమయెప్ప-కిడకు మగుడ।
నరిగె నెవ్వగ మనమునఁ-బిరిగొనంగ।
చిన్నవోయిన మొగముతో-సింహబలుఁడు॥"

ముప్పిరితాడుఅనియుఁగలదు.

౧౯ ఔత్కట్యం=పొంపిరివోవుట. ఉదా—

"క. పరుషత్వము లేకంతః।
కరణము శుచి శుద్ధి చాల-గలిగి ప్రియము పొం।
పిరివోవఁజేయు దానము।
పరమోత్కృష్టత్వ మబ్జ-పత్రదళాక్షీ॥"

తెంపిరియనియుఁ గలదు.

౨౦ అనుకారః=పురపుర. ఉదా—

"చ. అరయనతండు మానధనుఁ-డక్కట రంగమునందునిల్చి సుం।
దరులకు నాట నూప్తెను వి-ధం బతిదీనము దానిఁజూచి యే।
బురపురఁబొక్కుదుం గడుపుఁ-బ్రోచికొన న్లఘువృత్తికిమ్మెయిన్।
బౌరనగువాఁడె దేవపతి-సూనుఁడు దైవము చేతచూచితే॥"

౨౧ అభిక్రమః=పురిగొల్పుట. ఉదా—

"క. తిరిగిన పందలసేటికి।
బురికొల్పఁగనున్న వారుఁ-బోమురుగాకే।
గురుపతి జయంబుఁగొని యి।
ద్ధర యేలఁగ జూడనేర్చె-దనె విను నన్నున్॥"

నారపురి, దాన్యపుపురియనియుం గలదు.

౨౨ సామ్యం=పురుకు, పురుణింమట, ఉదా—

"మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁడ-శ్వత్థామ గాండీవితో।
బురణింపందగువాఁడు వీనికిన యీ-భూలోకసంచారు లె।
వ్వరులేరీతఁడు బ్రాహ్మణుండనిన భే-వంబూనఁగానేరమిం।
రమూహింపఁగలేమ కానిజముచం-దంబయ్యెడున్ బోరులన్॥"

౨౩ జాతాశౌచం=పురుడు. ఉదా—

॥ క. ధరణిఁగడుఁబేదవారును।
బురిటికి ఘృతతైలధాన్యములు ముందరఁ జే।
చ్చిరసంగ్రహింతురని మన।
కరుద్ధుగ నవి దుర్లభం బు-లర్థము లేమిన్॥'

తుంపురులు, తుప్పరులు, ప్రుసగు, పురువు, పుర్వు అనియు నుం గలవు.

౨౪ వర్థనం=పెరుగుట. ఉదా—

॥ క. కురుసేనఁ గదా గెల్చుట।
గరము భరము నరునకనకు-గాండీవమునం।
బెరిగిన యమ్ములపంటలు।
దరికొని తెగఁగాల్చునట్టి-దయయగుఁజుమ్మీ॥''

౨౫ ప్రాప్తిః=పొరయుట. ఈయర్థమందే ఒరసె ననియుఁ గలదు. ఉదా—

॥ సీ. తిరుగుడు రెంగిలి-వొరసిన నేమతే,
నీవునిద్రించిన-నేలనిడిన।
నపహరింతురు భక్తి-నర్పించి యిడిదాల్ప,
నాకలి నీరు వ-ట్టగ్ని భయము।
విషవికారము భూత-భేతాళబాధలు,
పొరయవు వినుము బా-లురకునైన...॥''

౨౬ పునఃపునః=పొరిబొరి. ఉదా—

॥ చ. పొరిబొరి తిప్పి రెట్టిగన-పూర్వవిలోకనమాచరించుఁ దా।
త్వరమగు సద్వివేకమునఁ-భావనిరూపణ సేయు గౌతుక।
స్ఫురణగరంబు తత్కరముఁ-బొందనయంబునఁ జేర్చు వాక్యవి।
స్తరచతురత్వమేర్పడఁగ-సల్లపనంబొనరించు నర్థితోన్॥'

పొరిబొరి యనఁగా ప్రతిదినమును అని చెప్పవచ్చును. విత్తనము లు మూఁడవపొరిని మొలకరెత్తుచున్నవి. రోగికి జ్వరము పొరితప్పించి పొరిని వచ్చుచున్నదని వ్యవహారముకలదు.

౨౭ జీవితం=పొరి. ఉదా—

"చ తనపొరిపోవునంతకు ను-దగ్రతయుం గపటంబు మానఁడే।
ర్చునెన్నిత రాష్ట్రినూనుఁడుయు-శోభరితంబగుభారతాన్వయం।
బున లోకనిందవచ్చునను-బుద్ధి దురాత్ములకేలఁగల్గునా।
యునమెయిబోయి హీనగతి-నైన ఘటించిన నెంతయొప్పనో॥

పొరియనఁగా ముందరయనియును నర్థముకలదు. ఉదా—

"గీ. ముట్టుపొరి భార్యగవయుట-మాత్రమును బు।
రీషమునునీరలిడుపు వి-ద్వేషయుక్తి।
యోషిదుపజీవనము మృణా-శోత్కరంబు।
మిచ్చిలుట బోలు కల్మష-ములు దలంప॥"

౨౮ పొరింతం=పొరువు. ఉదా—

"క. బిరుదుఁగల మగలుఁగలరని।
తెరమిడి చంపింపఁజూచె-దవు జనముల నీ।
పొరువునఁ బోశరతుము మా।
పురమునువైశంబవిడచి-పొమ్మెందైనన్॥"

౨౯ పరివర్తనం=పొరలుట. ఉదా—

"క. కురున్నప విను సంసారము।
దరిఁదొరిక్కనవార మింక-దఱఁకెదమే సం।
గరమునకు నేమునీకై।
పొరలితిమెట్లయినననువ-పోయెదమను మన్॥"

30 పలాండ్వాదిత్వక్ = ఉల్లిపొర, అరటిచెట్టుపొర. పొరలేనివాఁడనఁగా నబద్ధములేనివాఁడు. ఉదా—

,, క. హరియొకఁడునీవొకండునుఁ।
బరమాప్తులుగలుగనరుఁడు-భారపుపనికిన్।
జోరనలుకడ్డునీకూరిమి।
పొరపొచ్చెముఁగాకయుండఁ-బోవగవలదే॥''

పొట్టువొరలును పొప్పొరలు. ఇవి పకారపూర్వరేఫములు.

శ్లో॥ అవష్టంభబుజావృద్ధిపంకప్రాప్తిర్బపూర్వకాః।

౧. అవష్టంభః = బరవసము. ఉదా—

,, క. బరవసమెరయఁబ్రదిగర్తే।
శ్వరుఁడిట్లనుడుచిత్తమింక-జననాయకుఁడే।
వ్వరుసున నానతియిచ్చెను।
దొరలేవునిరట్లుసేయఁ-దృఢిఁగార్యమగున్॥''

౨. బుజః = నిబ్బరము.

3. వృద్ధిః = ఉబ్బరము.

౪. పంకః = బురద.

౫. ప్రాప్తిః = బెరయుట, బెరసె. ఎరసెయనియునుం గలదు. ఉదా—

,, గీ. సురనదియునుఁ గాళిందియు-బెరసినట్టి।
కాంతిపూరంబుశోభిల్లు-శాంతమూర్తి।
నామనంబునానందమ-గ్నముగఁజేయు।
నెలమిసన్నిధిఁజేసె సి-ద్ధేశ్వరుండు॥''

ఇవి బపూర్వరేఫములు.

శ్లో॥ స్మరోనివృత్తిఃపర్యాయఃపద్మినీసుషమాపిచ॥ ౫౦॥
అంతస్స్వార్థిధ్వనిస్త్రీవవృష్టిశ్చైతే మపూర్వకాః।

౧. స్మరః=మరుఁడు. ఉదా—

“క. ఇరువురనొండొరువులఁగడు।
సురుచిరముగఁజూమవాఁడె-చూడ్కులఁదనరన్।
శరములుగాఁగొనియేసెను।
మరుఁడయ్యిరువురమనోభి-మానచ్యుతిగాన్॥”

౨. నివృత్తిః=మరలుట. ఉదా—

“క. మరలెదుర్ధర్షణుఁడుదోన-తెరలెసేన।
నపుడు సమ్మోటకోలల-నంకుశములఁ।
జేసుకోలలతీటుల-నీరతార।
యపలుపులవాహనంబులు-బెదరిపరచె॥”

౩. పర్యాయః=ఇమ్మరి. ఉదా—

“క. సురసరిదాత్మజుఁడును శర।
గురుఁడునుఁ గర్ణుండుఁ దెగుట-కుందలకక యొ।
వ్వరిబాహుబలముఁగొని యి।
మ్మరిగోల్తలఁజేసిరోకొ-మునవారనిజెన్॥”

ఇమ్మరియనునది పునరర్థముకాదుగనుక శకటముకాదు.

౪. పద్మినీ=తామర. ఉదా—

“క. నరుఁడలుకపొడమియును సు।
స్థిరుఁడై తనయొజ్ఞసెరల-చెలువుష కెందా।
మరలందెగడెడుకన్నుల।
నరుణచ్ఛవిమెరయ సట్లు-లనియొనరేంద్రా॥”

విడమర, పడమర, పెడమర, సోమరపోతు, తాటిమర, ఇంటి కొమర, నెమర, ముమ్మరం అనియును గలదు.

౫. సుషిమ = మురిపెము, మురిసె, మురియుట యనియును గలదు. మురియులునుఁగూడ కలదు. ఉదా—

"సీ. నునుఁదీగఁజీరికిఁ-గొన్ననినీమెయిఁదీగ.
మురిపంబు డెందంబు-మరలుకొల్పె...॥

౬ అంతస్స్ఫూర్తిః = లోపలి మెఱమెరగానుండుట. ఉదా—

"క. పురుషుండనవేఱొకఁడుఁడె।
పురుషోత్తముఁడైనయేన-పురుషోత్తముతా।
స్ఫురణకుఁబురుషత్వంబను।
మెఱమెరఁగలదదియకాదె-మైకొనుక్రియలన్॥"

"క. అరివధముపాపమేయను।
మెరమెరఁగలిగిననుఁదగిన-మెయిఁజేయుము...॥"

౭ ధ్వనిః = మొరయుట. ఉదా—

"క. సురలార్చిరితూర్యంబులు।
మొరసెననేకంబులపుడు-మోదమునమునుల్।
హరిహరులంగీర్తించిరి।
సురేంద్రునగ్గించిరధిక-శుభవాక్యములన్॥"

౮. తీవ్రవృష్టిః = మొరపవాన, రాళ్ళవర్షమనుట. ఉదా—

"ఆ. మొరపవానపెల్లుఁగురిసె-నులాభ్రతతి।
దుల్లెఁబడియెఁబిడుగు-లెల్లయెడల...॥"

మరిది, మరదలు, తిమ్మెర, తెమ్మెర, ఎండాకులచప్పుడుమరమర. ఇవి మపూర్వరేఫములు.

తిరిపము, మురిపము, మొరపమును రేఫములు గనుక కొరపమును రేఫమని యున్నది.

శ్లో॥ సాదిహూతిస్సభారిక్తం ద్వే గురు ద్రేభపూర్వకాః॥ ౫౧॥

౧. సాదీ=రవుతు. ఉదా—

"చ. .......................................................నీ।
రవుతులు జోదులున్ రథిక-రాజియు వారి మొనల్గలంపగా...॥"
రావుతులు నుగలదు.

౨. హూతిః=రండనిపిలు మట. ఉదా—

"క. రండని పిలువఁబనిచి పాం।
డ్రిండని కొడుకులకుఁ జెప్పి-యింద్రప్రస్థం।
బొండెను, వేరొక పట్టణ।
మొండెను మాకిచ్చి యేను మ-టుచితము కాదే॥",
రాదు అనియును. ఉదా:—

"చ. రణమున వారలం గెలువ-రాదను పల్కు-లులుండనిమ్ము...॥"
రమ్మనియును గలదు.

౩. సభా=రచ్చ. ఉదా—

"ఆ. రచ్చకొట్టంబు నా-రామంబుఁ గూపంబు।
ప్రపయుఁ గావించుట-భయభరార్త।
కోటిఁ గాచుట...॥" అని.

౪. రిక్తం=రిత్త, రిచ్చ ఉదా—

"ఆ. మహిత కమలజఠర-మధుర సాస్వాదన।
పరవశాత్మయైన-భ్రమరకాంత।
రిత్తబుద్ధి నకట-రేఁగుబువ్వులరసం।
బానునట్లు చేలవైతిఁ గాక॥".

"క. కని యుత్తరుండు గరుపా।
రినమేనునుఁ దలఁకు మనమును-రిచ్చవడిన చూ।

ఘనునైతో ట్రుపడుచు ని।
ట్లనిరి దిగులుసొచ్చి యాబ్ర-హ్మన్నలతోడన్॥"

ఈ రిచ్చయను పదము "రిచ్చపడిరి వారి పెంన ద-క్షిమికొని వచ్చెన్." అనుదిక్కన విక్రమమందు శకటసంబంధియైనది.

౫. ద్వి = రెండు, రెట్టి. ఉదా—

"క. ఈరెండు కారణముల ను।
రారాతియయర్ఘ్యమునకు-న్నర్హుఁడు జగదా।
ధారుండు మాకు కాదుస।
దారాధ్యుఁడు విష్టపత్ర-యావాసులకున్॥"

"క. నిజభూషణాతపత్త్రి।
ధ్వజకింకిణిబంధచేష్టి-తములైన తురు।
వ్రజగాత్రశకలములు వా।
రిజనాభకనుంగొనంగ-రెట్టించెనగల్॥"

౬. గరుత్ = రెక్క. ఉదా—

"ఉ. రెక్కలుసించి కంఠమున-రేకులుదాపి శిరంబువ్రచ్చి పే।
రుకక్కన...॥"

ఇవి హ్రస్వపూర్వరేఫములు.

శ్లో॥ దాసః క్రమస్సముచ్ఛ్రాయోమ్రుమత్వం భేదసంభటాః।
ఉపాయముగుపాయశ్చవపుర్వాగప్రతిలాయిమే॥

౧ దాసః = పనివాడు. ఉదా—

"క. పెరువట్టుఁగలనేతనయులు।
బరువడిదుడువంగఁగ్ణుఁ-బనుచుచున్ భా।
సురరాజ్యదర్పమెప్ప ని।
దురుఁజెచ్చెరఁబనిచెడునఁ-దోడ్కొని తేరన్॥"

